# *Shakespeare's*

# OTHELLO

TELUGU

G. Viresalingam Pantulu, B. A,
Cocanada.

S.R.P. WORKS, COCANADA.

షేక్స్పియరు రూపక సంతాన కథారాజ హారావళి.

(కిసలయమాలూనాం కరరుహైః)

TALES FROM SHAKESPEARE.

# ఒథెల్లో—వెనీసునగరపు మూరు

# OTHELLO—THE MOOR OF VENICE.

# సతీసుందరి

---

గోగులపాటి-వీరేశలింగముపంతులు బి. ఏ.

ఆంగ్లసామ్రాజ్య, స్థిరీకరణశాఖ, ముద్రికాధికారివలన,

నాంధ్రమున రచితము.

కాకినా

BY

GOGULAPATI-VIRESALINGAM PANTULU B. A

JOINT SUB-REGISTRAR, COCANADA.

మొదటికూర్పు,

1st Edition.



వెల 8 అణాలు.

Price 8 Annas.

(*Approved by the Madras Text-Book Committee for School Libraries—Please vide Fort St. George Gazette Supplement dated 19-4-27 Part I-B Page 230*)

# Opinions on the Telugu Hamlet by the Same Author.

## I

M. R. Ry.

Chirravuri-Varada Rajulu Pantulu Garu, B.A.B.L.,
Subordinate Judge.
Cocanada, writes :—

'I recently had the pleasure of going thro' the Telugu rendering of Shakespeare's immortal play 'Hamlet' by M. R. R. G. Viresalingam Pantulu Garu and was very much impressed with it. It struck me as being a *Unique* work of its kind, with a peculiar charm of its own, both in feature and style. As regards, this latter, the author seems to have gone a little out of the beaten track and struck a new path; and whether or no, it satisfies the *accepted tenets* or conventions of strict literary prose, it has indeed, a peculiarity of its own, striking, as it does, a happy mean, between classical and colloquial styles (Grandika and Gramya) and cannot fail to appeal alike to both scholars and laymen. The author has obviously taken great pains to bring out the spirit and force of the original in all its essentials by a

close and literal translation, and has in my opinion succeeded in his efforts in a large degree. The book undoubtedly gives very interesting and instructive reading and presents a well-known story in a graphic manner, with a force and charm all its own. It forms in my view, a very valuable contribution to Telugu Language and Literature and apparently introduces a new form of Style, more pleasing and euphonious than the old worn-out one. I hope the discriminating Telugu reading public will extend their warm support and appreciation to the work and will thereby encourage the author in his efforts to bring out other important works of the great English Dramatist in an equally 'charming and forceful manner'.

---

II

M R. Ry.

Dr. Mandavilli Appala Narasayya Naidu Garu,

Ex. Member. Madras Legislative Council writes.

'I have gone through the book entitled "Hamlet" in Telugu written by Mr. G. Viresalingam Pantulu Joint Sub-Registrar Cocanada. It is a free and detailed translation of the play of the same name by the immortal bard "Shakespeare". The style is chaste and lucid and at times smacks of quaintness which lends much to its attractiveness. The spirit of the sublime pathos and grandeur of ideas in the original work have been faithfully and artistically rendered into the translation without the natural fault of tedious reiteration. The dedication of the work to the spirit of the author's lost love adds a heightened, if painful charm to it.

To sum up, I may safely say that the book will be an ideal Text for the use into Secondary and High Schools for pupils who could just begin to grasp poetic beauty.'

## III

M. R. Ry.

Kona Sitarama Rao Pantulu Garu, M. A.
(Hons-Edin.)
Dy. Inspector of Schools,
Rajahmandry Range, writes.

'Hamlet, it is a delightful reading. I never felt it as a translation which it really is not. No important idea or sentiment is left out and all the important portions are clearly brought out in a clearly inimitable style. It is really superb. There is absolutely no difficulty in understanding the philosophy hidden under the passages. Please accept my hearty congratulations. It appears to me quite original and I think the Andhra literature is immensely benefited by it.'



ఆంధ్రభాషావిశారదులు, (1) వడ్డాది సుబ్బారాయుఁడుగారు "**సాంతముగాఁ జదివితిని. ఆద్యంతములు రెండును సమానముగానే యున్నవిగాని యొండొంటికిఁ దీసిపోవునవికావు. మూల మెట్లుండునో గాని యీ యనువాదము కథయందు సందర్భపఱచిన బహుమహాకవుల సరసపద్యముల వలనను లోకోక్తులవలనను యుక్తియుక్తప్రసంగముల వలనను పాఠకులమెప్పును బొందఁదగినదిగా నున్నది" అనియు, (2) రావుసాహెబు గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు "మీరచన మిక్కిలి వింతగా నున్నది.

భాషకూడా అట్టిదే. "హ్యాంలెట్" వ్యవహారముపలెనే అలౌకికము. పాత మాటలు క్రొత్తమాటలు ఉన్నవీ లేనివీ కలిపి వాక్యవిన్యాసము అపూర్వముగా సాధించినారు." అనియు, (3) పట్టపరీక్షయందుఁ గృతార్థులయి యిప్పుడు, కాకినాడ నగరంబున జాయింటు సబురిజస్ట్రారు గారుగ నున్న మహారాజశ్రీ గోకులపాటి వీరేశలింగము పంతులుగారిచే రచియింపఁబడి, ప్రకటింపఁబడిన "హ్యామ్లెట్ - డెన్మార్కు- కుమారరాజు- హోహూ హోయి" అనుచిన్న వచనకావ్యమే తద్గ్రంథకర్తగారిచే మిత్రవాత్సల్యంబున నాకుం బంపఁబడినందులకు, వారికనేక కృతజ్ఞతానందనంబు లర్పించుచున్నాఁడను.

చక్కఁగా ముద్రింపఁబడిన యీచిన్న పొత్తంబును సావకాశంబుగ సాంతంబుగఁ జదవి చూచి, కరంబు హర్షించుచున్నాఁడను.

ఇది యనేక శతాబ్దంబులనుండి, యెల్లదేశముల వారిచే, హూణభాషాకవికుల శేఖరుండని సుప్రసిద్ధిని గాంచుచున్న షెక్స్పియరు మహాకవిచే సర్వోత్కృష్టంబుగ నింగ్లీషుభాషలో రచియింపఁబడిన "హ్యామ్లెట్" నాటకమునకు భాషాంతరము. ఇందలి భూమిక గ్రంథకర్తగారి జ్ఞానసంపదను వెల్లడించుచున్నది.

ఇది భాషాంతరమే యయిన నిందలి మనోహర సులభశైలింబట్టి చక్కఁగా నాలోచించి చూచినను, భావంబులు ధారాళంబుగ జాతీయముగు శైలితో వెల్లడింపఁబడిన మనోహర విధానముంబట్టి పరికించి చూచినను నియ్యది స్వకపోలకల్పిత గ్రంథముపలెనే కానఁబడుచున్నదని నిస్సందేహంబుగఁ జెప్పఁగలను. భాషాంతరముం జేయుటయందు గ్రంథకర్తగారికిఁగల నైపుణ్యమిందనేక స్థలములయందుఁ జదువరులకు సులభముగా బోధపడక మానదు.

ఇది పాఠశాలల యందలి రెండవఫారమునకైనను, మూడవఫారమునకైనను దగిన పఠనీయగ్రంథముగ నుండఁ దగినదని తలంచుచున్నాఁడను.

విద్యాశాఖవారి గ్రంథముం జదివిచూచి, తమకుందోఁచిన తరగతికిం బఠనీయగ్రంథముగ నిర్ణయించి, గ్రంథకర్తగారి తెలుఁగుననే షేక్స్పియరు మహాకవియొక్క మిగిలిన నాటకములంగూడ భాషాంతరీకరించు ప్రోత్సాహంబును గలిగించెదరని హృదయపూర్వకంబుగ నమ్ముచున్నాఁడను.

నిరంతర నిగర్వమార్గప్రదర్శకులని చెప్పవలసిన యీగ్రంథకర్తగారు దమకుం గల పూర్ణభాషాపాండిత్యమును, నోపికయును సార్థకంబులగునట్లుగా మిగిలిన ముప్పదియైదు నాటకముల నిత్తెలుఁగుననే రచియించి, ప్రకటించి, నవరసభరితాద్భుత నాటకరచనా పారావారపారంగతుఁడని ముమ్మాటికిం జెప్పవలసిన యాషేక్స్పియరు మహాకవియొక్క జ్ఞానామృతమాంధ్రదేశీయులు గ్రోలుభాగ్యంబును దప్పక కలిగించెదరని సుహృద్భావంబునం గోరుచున్నాఁడను.

తోలేటి వెంకటసుబ్బారావు,

ఆంధ్రోపాధ్యాయుఁడు,

యూనైటెడ్ లూథరన్ చెర్చిమిషన్ మిడిల్‌స్కూలు.

రాజమహేంద్రవరము,

**25-10-1926.**

ఆంధ్రకవయిత్రి శ్రీమతి కొటికలపూండి సీతమ్మగారు “శైలి శ్రోత్రరీతిని గానఁబడుచున్నది. కథ యత్యంత జాలికరముగానుండి యుద్రేకపూరితమై రసయుక్తముగా కానఁబడినది. హ్యాలెంట్ పితృభక్తియు సత్ప్రవర్తనాసక్తియు, ధైర్యస్థైర్యములు, స్తుతిపాత్రములు” అనియు వ్రాసియున్నారు.

మ. ప్రికటం బౌమృదుభాషయున్ సరసహూభావంబుతో నిండివా
చకరత్నంబన నొప్పి నూనములలో పాటిం గుబాలింప చం
పకమెంతేనిఁ బ్రిశస్తిఁ జెందుగతి 'హేమాహేమి' నానొప్పు పు
స్తకరాజంబు ప్రిశంసనీయముకదా ! చర్చింపనోధీవరా !

పాలూరి సుబ్బారావు (లక్ష్మణ)
Indian Medical Practitioner.
జేగురుపాడు.

పత్రికాధిపతులును, పండితులును, రాజకీయోద్యోగులును మొదల గువారిచే మోక్షసాధనమున కిది ముఖ్యమైన గ్రంథమని మంచి యభిప్రా య మొసఁగబడిన జీవబ్రహ్మైక్య వేదాంతరహస్యము.

రెండవ కూర్పు.

ఈరెండవ కూర్పునం దనేక దేవరహస్యములును, వేదాంతవిషయ ములును జేర్పఁబడి యున్నందువలన మొదటికూర్పున కంటె నీకూర్పు నందు నూఱుపుటలు యధికముగాఁ జేరుటయేగాక, సందర్భానుసారముగ మునుపున్న పటములకంటె నక్కడక్కడ క్రొత్తపటములనుగూడ ముద్రిం చిచేర్పఁబడి యున్నవి.

సోహం మంత్రజపప్రభావము, శ్రీరామమంత్రము శ్రీరామమం త్రోపదేశము కర్మవాక్కునఁగాని మనస్సునఁగాని ఉచ్చరింపకయు దలఁ పకయు శ్వాసమనెడి నూలుచే రామమంత్రముచు బిగగట్టి జపము చేయు చున్నప్పుడు తన్నుఁదాను మఱచి ఆనందపరవశుఁడయియుండు రహస్య మును; ఏకాంతస్థలమున, యోగాభ్యాసము (ప్రాణాయామము,) నీళ్ళు త్రాగి కాయశుద్ధిచేయుటయు, జీవులుచేయునట్టి పుణ్యాపాపకర్మముల కం తకు జీవుఁడు సాక్షియయియుండి వారివారి పుణ్యాపాపములకుఁ దగినట్లు సుఖదుఃఖముల ననుభవించుటకు పునర్జన్మము నిచ్చుచున్నాఁడని ఉపనిష ద్భగవద్గీతా దృష్టాంతములతోఁ జెప్పి హృదయకమలమును రెండు చీలికలుగా

జీల్చి ఆత్మజలమధ్యంబున నున్నదానిని జూపి, హృదయములోనే పంచ భూతములు అణగియున్నవని ఆఱురంగులుగల పటములమూలమున తెలుపఁబడియున్నది. పంచాక్షరమంత్రము, పంచాక్షరమంత్రోపదేశము జపము చేయుటవలన తామీవరకుఁ జేసినపాపము లన్నియు నాశమగుటకు మార్గ మిందు బట్టబయలుగా మంత్రశ్లోకములతో వ్రాయఁబడియున్నది.

ఇట్టి దేవరహస్యములన్నియు ఉపనిషత్తులలోనున్నను, ఇదివఱకిట్టి గ్రంధము నెవరును ముద్రింపించి ప్రకటించియుండలేదు. ఈగ్రంథకర్తగారు యోగినైనందునవలననే సకలప్రపంచము శ్వాసములోనే యణఁగి యున్నదని స్వానుభవమువలన గ్రహించి అందులకు ఉపనిషత్తుల దృష్టాంతములను గూడ నిందుచెప్పియున్నారు.

ఈపుస్తకము 24 పౌనుల గ్లేజుకాగితముల మీఁద క్రౌనుసైజులో ముద్రింపబడి యున్నది సందర్భానుసారముగా నక్కడక్కడ పూర్వకవి ప్రణీత గ్రంథములలోని పద్యములు చేర్పఁబడి యున్నవి. యోగాభ్యాసము చేయువిధము ఫోటోపటముల (Halftone blocks) మూలముగ దెలిపి, వీటిని 50 పౌనుల మంచి నునుపుకాగితముల (Art paper) మీఁద ముద్రింపించి చేర్పఁబడియున్నవి. గిల్టక్షరములువేసి కాలికోగుడ్డతో నిండుగా బైండు చేయఁబడిన వెల రూ. అ. పై

జీవబ్రహ్మైక్యవేదాంతరహస్యము ... ... 3—0—0

తపాలు వి. పీ. ఖర్చులు మొదలగునవి కొనువారే భరింపవలయును.

ఈగ్రంథములు వలయువారు :—

# అవతారిక.

'ఉ. కారణజన్ముఁడై, కవినికాయము మెచ్చఁగఁ గావ్యకర్తయై
భూరికళా కలాపుఁడయి పొల్పునహించెను'—

జగదేకపూజ్యుఁడు, షేక్స్పియరు (Shakespeare) ఒథెల్లో (Othello) నాటకమున,రసములు,రస రసములు,నవర సములు, నవనవ రసములు బిందుబిందువులుగ బిందించినాఁడు. బింబబింబములుగ బింబించినాఁడు ; చిత్రచిత్రములుగఁ జిత్రించినాఁడు. దానింజదువుపూరు,

'చ. సకలవిశేషశోధనకుఁ జాలిన యోనెరజాణ! *
* * సాసుకృతమంతయు నేఁడుసుమీఫలించుటల్.

'ఉ. * నందులచంద మెఱుంగువారు నీ'
మెచ్చరొ,యబ్బురంబనరొ,మేలనరో,కొనియాడరో నిన్నుఁ'

అంతేయ కాదు. భూమండల వినుతుఁడవు, షేక్స్పియరు కవిచంద్రా!

'మ. * * కవితా విద్యా బలప్రౌఢి నీ
కెదు రేఁ? సరసార్థబోధ ఘటనా హేలాపరిష్కార శారద
[నీరూపము'

అని యనకమానరు.

ఇంకను,

'చ. మతినజుఁడంచు రూపమున మన్మథుఁడంచు నయోన్నతిన్
బృహ! స్పతియనుచున్ వదాన్యతను భానుసుతుండనుచున్
నుతించు నా! ర్యతతి నిరంకుశాంకవయః'

అట్టి యీపురాణపురుషుని యవతారము, స్మరణీయము, భావ్యము,సంభావ్యము. ఆంగ్లదీవి,పచ్చపచ్చగ నుంను మవచ్చిన ది, పదునాఱవశతాబ్దమున. ఎలిజబెత్ రాణి, యంకుశము లో మాటుమణఁగియున్నవి, మగవారియాగడములన్నియు. మహారాణీ,మహారాణీసర్కారుకు జయ్ జయ్ శబ్దములు,చుట్టుముట్టియున్నవి. మగవారి దేటిరాచఱికము? అను వాణి దే విలాసము. భాషాపతులు సభాపతులయినారు. సభాపూజితు లయినారు. అందు మనషేక్స్పియరు మూర్తియు నున్నది. తన మ్యాక్బెతు (Macbeth) నాటకము నామె యెదుట సభాస్తారుఁడయి చదువునప్పు డామూర్తి రమణమూర్తియే, వైయున్నాఁడు. ఆపటము ముద్దులు మూటఁగట్టు పటము; షేక్స్పియరు కీర్తిపటము. అతఁడు చదువులోఁ బడినాఁడు. రాణిగారి నిండుదర్బారు,యితరమేమియు నొల్లక,యితరమునుఁ జేష్టలు దక్కియున్నది. చదువునందు లీనమైయున్నది.

అంతకుమించినదీ 'ఒథెల్లో' నాటకమురచన. 1604 సంవత్సరము. కృతిబ్రహ్మవయస్సు నలుబది.

మనవాఁడు విలియం షేక్స్పియరు (William Shakespeare) 23-4-1564 నఁ బుట్టినాఁడు, మూఁడవకాన్పునకు. పుట్టినది సుదినము, జార్జిదేవర యారాధనదినము. ఎవర్ నదినానుకొనియున్న స్ట్రాట్ ఫర్డు Stratford-on-Avon) గ్రామము జన్మస్థలము. తండ్రి జాన్ (John). తల్లి మరియమ్మ (Mary).పదిమందిపిల్లల తల్లి. పిల్లల కోడి.తల్లి పుట్టియింటనుండి భూవసతితో వచ్చినది. మనవిలియమును 1571 సంవత్సరము నఁ బాఠశాలకు వేసినారు. జీతము నాతము లేదు. వెట్టిచదువు. చదువు వెట్టికిఁ బుట్టియున్నది, పెట్టిపుట్టినవారికి. పుట్టిపెరిగి,బట్టకట్టనేర్చిన వారికి. ఆంగ్లభాష మాతృభాష యున్నది సరేగదా. యూరపుఖండపు దేవనాగరిభాషలు,గ్రీకు,ల్యాటిన్ భాషలు నాలుగుముక్కలు చెప్పుచు వచ్చిరి.అంటెడువారి కంటును. లేనివారికి లేనే లేదు. మనవానిపాలిఁటికిఁ జదువు వర్ష కాలమునాఁటి చదువయినది ; అంటలేదు. తాంబూలమా, నాలుకకునిండుగ లక్కవలెనంటుటకు;సున్న మెక్కువయయింయినఁ బొక్కుటకు ; చెక్కమెక్కువ యయిన సొక్కుటకు; ఆకు మెక్కువ యయినఁ బైత్యరసము క్రమ్ముటకు. చదు వంటుటకు ధ్యాస యుండవలయును; ఆసక్తి యుండవలయును. పుస్తకములు బాగుగఁ బట్టినట్టు లేదు. వస్త్రము కట్టుపోకునకు, లోటు మాత్రముండదు. ల్యాటిన్ యొకింత యేమంటినదో, యేమో

గాని,గ్రీకుభాష యింకను బూజ్యము. డొక్కశుద్ధి మాత్రమై నట్లొప్పుకొన వలయును. కుఱ్ఱవానికిఁ జదువు వచ్చిపోయినది. పాఠశాల విడిచినాఁడు. ఇల్లును మరగినాఁడు; యింటిపట్టును. తండ్రిగ్రహమున్నదే? ఇంట. తల్లినెటులనో,బూటకము చేయ వచ్చును. తండ్రి తనచేతిక్రింద మెదిగించినాఁడు, కొడుకును. తండ్రిమాత్ర మైశ్వర్యముతోఁ దులతూఁగుచున్నాఁడా? కయి తొడుగుల కుట్టు పనులలోఁ గొన్నినాళ్ళు వ్రేలుపెట్టినాఁడు.అటుతరువాత,బొచ్చువ్యాపారము. అందులోఁ బడిపోయినాఁడు. లుగసానయినది. ఈవ్యాపారములలోఁ జతికినాఁడు. అందున లనఁ జింతలవ్రంతలం జివికినాఁడు. తుదకుఁ గటికివాఁడు కూడ నయినాఁడు. "ఉదరనిమిత్తం బహుకృతవేషః" ఏదియో నొకటి,యింకొకటి.మఱియొకటి,పొట్టపోసికొనుటకు. కొడుకున కీ వృత్తి వాచవి యాయినది. సహ్యము కాకపోయినది. ఆక్క యూడినఁగాని,చేతికిని,నోటికిని రాఁజయుండదు,కుదురదు.

'క. కలనాఁటి ధనములక్కఱ, గలనాఁటికి దాఁచఁ గమల గ
ర్భునివశమా, నెలనడిమినాఁటివెన్నెల,యలవడునే గాదెఁ బో
య నమవస నిశికిన్.'

పెండిలిసారెతో,భూవసతి యేమితెచ్చినదో,ఆఁగునా? సంతానము దశకములోఁ బడుచున్నది. పిల్లలకు ముచ్చటను రిపనులు జరుగవలసియున్నవి. వయసువచ్చినయెద్దులను మేఁ

పుట కేరితరము? తలఁపిచూడరయా? ముక్కుముక్కుగఁ బాలు కుడు
చుటకుఁ గుడుపుటకు. పేఁపబెత్తము తీసికొని,కొంతకాలము బ
డిపంతులువేషము వేసినాఁడు. పిల్లకూనలకుఁ జెప్పవస యుండి
న నుండుఁగాక; ఉండకపోవుఁగాక. బెత్తమాడినఁ జాలు. పం
తులుపదవి వెలిఁగించినాఁడు. కాని చేతినిండ,జేబులనిండ రూ
పాయిలు గలగలలాడు పదవియా? పిల్లపిల్లలుమాత్రమునలుగు
రును గడగడలాడుదురు. ఉపాధ్యాయుల మహిమయా?
కాదు,పేపబెత్తము ప్రతాపము, వీఁపు పగులునేమో యనుభ
యము. అఱచేతు లట్టులు మాడునేమో యనుభయము. ఉ
పాధ్యాయులవారయినారు. అందుఱును ఏలేశ్వరోపాధ్యాయు
లే (Dr Arnold of Rugby) యగుదురా.

న్యాయవాదులయిండ్లవాకిలులు, లక్ష్మిగ్రవాకిండ్లుగ నుం
డుటఁ జూచి,వాచి పోయినాఁడు. వారివారి లేఖకులు (గుమా
స్తాలు) కూడ,వారివారి సీటులలో,సగముసీటుతోఁ గులుకుచుం
డుటకు,సంపాదనయే గదా యని,యిందులో నిరికినాఁడు. చి
న్నవాఁడయినఁ గాని పెద్దవాఁడు కాఁడుగదా. ఈమధ్యకాలము
న బల్లగొప్పగూర్చుండి,వ్రాఁతకోఁతలు కావలయుఁగదా. తిన్న
వేసికో వలయుఁగదా. నడ్డి వంగవలయు. ఒడలువంగవలయు.
తిరిగెడికాలు నిలుచునా? ఎంతకాలము నిలుచును? నిలువఁద
లఁచినను,దోడిస్నేహితులు,తోడిరాగము,తోడి యనురాగము

నన్నువిడుతురా? ఇక్కడికీయుద్యోగముకూడ సొంతమయినదీ. లాభము లేదు, కాని రివాజులు కనిపెట్టినాఁడు. న్యాయవాదిచే తఁ దివ్వివెుటుల బ్రహ్మియగునదియు, బహ్మివెుటులఁ దివ్వి యగునదియుఁ జక్కఁగఁ గనిపెట్టినాఁడు. గ్రహింపు యున్న ది, ఊహ యున్నది. న్యాయకూటములు వాడుకొను, ప్రయో గించు నాలుగుపదము లేమిపట్టుపడినవో. న్యాయస్థానములవ్య వహారములు, సాంప్రదాయములు, సుబొ, అనిన నాఱునెలలు పట్టను. తమతమకక్షిదారులకు, నిమ్మకాయవాటము చేయవ లయును. చూపవలయును. న్యాయమూర్తి తీర్పునకును, దినదిన ముఖారవిందమునకును, ముడిపెట్ట వలయును. ముడివేయ వల యును. ఈరెండింటికిని మధ్య లంగరు వేయ వలయును. ఎదిరికక్షి దారు పక్షమునకు భజగోవిందములు కొట్టవలయును. తామే తుమ్ముఁ దెప్పించుకొనవలయును. తుమ్ముకొన వలయును. చి రంజీవి, శతాయుష్యల ననుకొనవలయును. తమకందఱకును శ్రీ రామరక్ష. తనయజమానులవారలద్వితీయులు.

తానేమో మతిమంతుఁడు పనిమంతుఁడు, హనుమంతుని తోఁక. ఈమాట, పుంత షేక్స్పియరుకు గిట్టలేదు. పగటిభాగ వతులు రాత్రియాటకులు, నాట్యరంగమప్పుడప్పుడు, స్ట్రాట్ ఫర్డు గ్రామమునకు వచ్చుచుండెడివారు—చుట్టపుఁజూపు. రికామిగ నుండు మూఁకలో మనవాఁడు మొనగాఁడు ; చలాకీవాఁడు ;

నోరున్నవాఁడు,కంఠపుష్టి యున్నవాఁడు, విగ్రహపుష్టి యున్న
వాఁడు. ఈగుంపుపోనిది,నాటకమాఁడుట గలుగదు. ఇంతకును
నాటకపుసజ్జు గదా. నాటకోజ్జీవనసంఘమువారికిని, మనవాని
కిని,మాటలు కలిసినవి ; చూపులయినవి ; మనసులు కలయి
కలయినవి ; ఆంతర్యము లైక్యములయినవి. నాటకములవారా
గ్రామమునుండి, జెండా యెత్తగనే,తానును బిచాణా కట్టినాఁడు,
స్వస్థలము విడిచినాఁడు. స్థలస్థలములు దిమ్మఁదిరిగి లండన్నగర
ములోఁ బడినాఁడు (1587 సంవత్సరము) బస్తీలో ననాను
కుఁడు ఏపనియైననేమి ? ఎవరికి ఖాతర్, వ్రేలుపెట్టి చూపు
వారెవరు ? నాటకములకు,వచ్చు,పోవు వారిగుఱ్ఱములను బట్టు
కొని సురక్షితముగ నుంచి భద్రముగఁ గాపాడి, నాటకాంత
మున నెవరివాహనములనువారికి వప్పఁజెప్పుఁపని. ఇందువిశేష
మేమియును లేదు.కానియెందులోను జాకచక్యముండవలయును.
నిద్రతోఁ దూఁగుచున్నయెడల,నఱచేత బిళ్లలెట్లుపడును ? కొం
తకాలమిట్లు గడచినది. అన్నము పుట్టించుకొనినాఁడు. అన్న
ముపుట్టినది. లండన్ నీరు వంటఁబట్టుచున్నది. సూత్రధారునిఁ
జేతిక్రిందఁ గొంతకాలము మెదిగినాఁడు. యువకుఁడు చురుకు
నాఁడు. తెలివితేటలున్నవి. పిలుపునకుఁ బలుకును. చకచకప
నులు చేయును. చిన్ననాఁటివాసన యుండియే యున్నది. మ
ధ్యమధ్య పుస్తకముల బూజు దులిపినాఁడు ; చేపట్టినాఁడు.

క్రిందకు,మీదకు,నెగ, దిగ, పాఱఁజూఁచినాఁడు. పట్టినంతవఱకు జదువు, వంటఁబట్టించుకొనినాఁడు. వంటఁబట్టినంత వఱకు నోటఁబట్టించుకొనినాఁడు, వ్లైకు దింపినాఁడు. తాను వేషములలోనికి దిగినాఁడు. ఆటపోటులోఁ బడినాఁడు. ప్రేక్షకులమెప్పును గనినాఁడు. నటనకు నాట్యమునకు గని యనిపించుకొనినాఁడు. అక్కడనుంచి వ్రాఁతలోఁ బడినాఁడు. లేఖని దనయఁదుపులో నుంచినాఁడు. ఉన్న నాటకములను రక్తి కట్టించుటకుఁ బాటుపడినాఁడు. బరువులు కత్తిరింపులు గావించినాఁడు; అతికింపులింపుగఁ జేసినాఁడు. ఉత్తరింపులింపుగఁ జరపినాఁడు. ఆట రక్తియే కట్టినది. అసలువాఁడెవఁడోగాని, మధ్యవాఁడు,మనవాఁడే మానాఁడే గ్రంథకర్త. అటుపిమ్మట స్వతంత్రములోఁ బడినాఁడు. అన్యాహతముగ నెఱవేర్చుకొనినాఁడు. పేరుప్రతిష్ఠలు క్రమముగ నెక్కిపోవుచున్నవి. నాటకములరంగము (The Black-Friars Theatre)లోఁ బువ్వాల రంగఁడయి,పాలుపంపకములకు దిగినాఁడు. మఱికొంతకాలము (The Globe Theatre) మఱియొకనాటకశాలను జొట్టబెట్టి భాగస్వామి యయినాఁడు. నటరాజు కతరాజు కవిరాజు రాజత్రయమయినాఁడు, పూజ్యుఁడయినాఁడు. ఎలిజబెత్ రాణి, జేమ్సు 1, నృపుఁడు,సదాంప్టర్ ప్రభువులు మెచ్చులను జూఱ

గొనినాఁడు. దానితో సువర్ణరేఖ బయలుపడినది. ఫలములు నవరసులే, సవరనులే, కొల్లలుకొల్లలుగ. సువర్ణ మంత్రపుష్ప ము చేతిలో. చెయినిండుగనే జేబులో. జేబునిండుగనే మంద సములో.తండ్రికి గొప్పయండ యయినాఁడు. తండ్రియప్పులను దీర్చినాఁడు. తాకట్టులను వాకట్టులనుగాకుండ,నిలుపుదలకుఁదె చ్చి,విడిపించినాఁడు. కుదువలు విడిపించినాఁడు; కొదువలుదీర్చి నాఁడు. స్వగ్రామమున,మడి,మాన్యము, యిల్లు వాకిలి,వస్తువు వాహనము చేసినాఁడు. పాఁడి, పంట, కలిగించినాఁడు. తోఁ టలు వేయించినాఁడు. చుట్టపుఁజూపుగ నప్పుడప్పుడువచ్చి, తల్లి దండ్రులను, దోడఁబుట్టినవారిని, కట్టుకొనినభార్యను,గనిన బి డ్డలను,ముద్దుమురిపముగఁ జూచి, వెళ్ళుచు వచ్చినాఁడు. వ్రాసి ననాటకములు ముప్పదికి మించినవి.

'ఉ. కేవలకల్పనాకథలు కృత్రిమరత్నములాద్యసత్కథల్
వావిరిపుట్టురత్నములవారితసత్వవికల్పనావిభూ
షావహ పూర్వవృత్తములు సానలఁదీఁనజాతిరత్నముల్'

నేర్పు పెంపున నొనరించి రూపకరత్నాకరుఁడయినాఁడు. ఏమే మిఁయో రకరకముల రత్నములు, ఏమేమియో జాతిజాత్యంత రముల రత్నములు,పట్టుడు పుట్టుడు పెట్టుడు రత్నములకు నిధి యయి సానఁబెట్టి కఱకుఁదెచ్చి ప్రతిభ వెలిఁగించి రూపక ర త్నాకరుఁ డనిపించుకొనినాఁడు. కవిబ్రహ్మ యనిపించుకొని

నాఁడు. అంతకు నెక్కుడు షాట్టభరతులు ఛాందసపుబ్రహ్మలు (Benjonson) తిక్కశంకరులు (Milton) లేకపోలేరుకాని, యీసరసత, నిపుణత,సమయజ్ఞత నిక్కర్ష పుట్టినవి,పెఱిగినవి వర్ధిల్లినవి శోభిల్లినవి యిక్కడ.రోశినాఁడు, లండస్ నగరవాస మును.'జననీజన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి'; లౌక్య తాపత్రి యములుండనే యున్నవి. 1612 సంవత్సరమున నింటిపట్టునకుఁ జేరిదైవభక్తి,యేశుసేవతోఁగడుపవలయు ననుకొనినాఁడు.చేరు కొనినాఁడు గర్భవాసమును. అయిదాఱుసంవత్సరము లేమిగ డచినవియో, దైవ మోర్చక పోయినాఁడు. భూమికి భారమయి నాఁడు. తనువు కోపగించినది,చాలించినది. దానికడుపుకాల. పుట్టినదినమే మరణదినమయినది. అదే తేది 23 వ యేప్రిలు. సంవత్సరము మాత్రము 1616. గ్రామదేవాలయములో మ న్నయినాఁడు. జ్ఞాపకార్థమాయాలయముననే, అతని బొమ్మను నిలిపిరి.

పాండితిమాటకేమిగాని, చదువులమర్మము, సారము, కీలును గనినాఁడు,అన్నిఁటిలో నున్నాఁడు. అన్నిఁటిలోను వ్రేలు పెట్టినాఁడు. అన్నిపుస్తకములను జేపట్టినాఁడు. ఊఁతపదముల నేర్చినాఁడు;వాడినాఁడు. వానిమీద నుయ్యాఁతలూఁగినాఁడు.మ నుష్యులను బాగుగఁజూచినాఁడు, వాలకములునుగని పెట్టినాఁడు కీలకములను నడిపించినాఁడు. చవటవ్యవహారములకుఁ జెప్పులు

కట్టినాఁడు; ప్రాఁతచెప్పులను గట్టినాఁడు. చెవికుట్లు కుట్టినాఁడు. దుష్టులను దలకొట్టి మొలవేసినాఁడు. కంచుకాగడా వేసిపెట్టి వెదకినాఁడు. చెవి యిచ్చియే యున్నాఁడు ; కలము బట్టియే యున్నాఁడు. ఒడుపువేసియే యున్నాఁడు ; పొంచియే యు న్నాఁడు. వడియఁగాచియే యున్నాఁడు.

తోడిసమకాలికులు, మహావిద్వాంసులకు మనవాని చదువుసంధ్యలెగతాళి బేరమునకు దిగినవి. ల్యాటిన్ భాషాజ్ఞానము జూచిన బహుకొద్ది; గ్రీకింకను దఱుగు. కాని, యదియేమి మాయయో వానికడుపుడుక ! అన్నిఁటిలో నున్నాఁడు. వేదాంతులలో వేదాంతి ; న్యాయవాదులలో నైయ్యాయవాది; వైద్యులకు వైద్యనాథుఁడే. అధ్యాపకులలో, ఘనాపాఠి. మంచికి మంచి ; చెడ్డకుఁజెడ్డ ; తులసివనములో నొకగంజాయి మొక్కను మొలిపించును ; గంజాయివనములో నొకతులసి మొక్కను మొలకలెత్తించును. వీఁడెక్కడివాఁడు. వీని కడుపుడుక ! వీనికడుపుకంద వృద్ధిగాను !

'ఉ.    *    *        రసజ్ఞులార నా
యుల్లపుసౌధవీధిఁ గొలువున్న సరస్వతి సత్యవాణి నా
తల్లి యొసంగుపల్కులివి తప్పులుచేయక చిత్తగింపుఁడీ'.

ఈ మహానాటకమును గథాసరళిగ వ్రాసినాఁడను. రూపకతాళము తాళమానముగ, రసవత్తరములగు ఘట్ట

ములలోని మేలుకూర్పులు, సారంపుఁబలుకులు, వాక్యార్థము లు, అర్థాంతరములు, వక్రోక్తులు, యేమేమి భావగభీరత లెక్క డెక్కడ, నిబిడీకృతమైయుండినవో, వానినన్నిఁటిని, సాధ్యమైనం తవఱకు, నే గ్రహించినంతవఱకుఁ "దేనెసోఁకనోరు తీయన యగుదీతినిఁ దోడనర్థమెల్లఁ దోఁచునట్లు" గుమిగూర్చితిని ; క్రోడీకరించితిని ; మేలేర్చితిని ; సారము తీసితిని. అంటుకట్టితి ని. షేక్స్పియరువాడిన పేరులను, స్థలవిశేషములను, యితి వృత్తముల నిసుమంతయుమార్చక యుంచినాను. శతాబ్దముల తిరబడి చెక్కుచెదరకయున్న పేరులవి, సార్థకములయినవి, సాభి ప్రాయములయినవి, పుట్టినరసము వంటఁబట్టించునవి.

ఈబ్రహ్మాండగ్రంథమును నవగీర్వాణమునుండి తెలిఁగిం చితిని—నా నేర్చినకొలఁదిని. ఈగద్యకావ్యమునకు మహాప్ర సిద్ధి కలుఁగునుగాక ! లక్ష్మీశ్వరుండిచ్చుఁగాక ! లోకనుతుఁడు నరనుతుఁడు, నృపపుంగవులు, రాణియెలిజబెత్, రాజుజేమ్సు 1 లచే వినుతుఁడు, షేక్స్పియరు నైపుణీమహిమ, వాచాల త్వము, పాత్రవిలసనము, అపాత్రనిరసనము, మనుజస్వభావ నై జగుణ నిర్ధారణ ప్రచారములు, లోకజ్ఞత, వాఙ్మయ దురంధర త్వము, కళావిశదత్వము, ధర్మమార్గక్రియాదర్శకత్వములోనగు నవియన్నియు, నాంధ్రమాతకు, భారతికి మాయమ్మకు నూత నతొడవులుగ నమరునుగాక !

"మందఃకవియశఃప్రార్థి" షేక్స్పియరు మహాకవియశః ప్రార్థి ; భారతీమాత, తనతల్లిశలవు ప్రస్తుతము గైకొనుచున్నాఁడు. బుధారాధనవిరాజి, షేక్స్పియరుకు దాసానుదాసుఁడు, తన లలాటలేఖ, ఆయుర్భాగ్యలేఖ, కొంతకాల మీతను వున నిలచునేని, భాషాయోష వ్రాయించుకోలఁదియును, తక్కుంగల యట్టి నాటకకథలను వ్రాయసంకల్పించు కొనిన వాఁడు.

గోగులపాటి-వీరేశలింగముపంతులు బి. ఏ.
[జాయంటు సబురిజస్ట్రారు]

కాకినాడ.
1-6-27.



# ఈనాటకకథయందు వచ్చు పాత్రములు.

---

Duke of Venice—వెనీసు న్యాయప్రభువు.

Brabantio—బ్రబాన్షియో—డెస్డెమోనాతండ్రి.

Gratiano—గ్రాషియానో—బ్రబాన్షియో సోదరుఁడు.

Lodovico—లొడొవికొ—బ్రబాన్షియో రాజబంధువు.

Othello—ఒథెల్లో—మూరు, కథానాయకుఁడు.

Cassio—కేశియో—మూరుసేనాని.

Iago—అయాగో—[illegible]వృటావాఁడు.

Roderigo—రోడరీగో—వెనీసునగరమువాఁడు.

Montano—మాంటెనో—సైప్రసు దొరతనమునకు, ఒథెల్లో తరువాతివాఁడు.

Desdemona—డెస్డెమోనా-ఒథెల్లోభార్య కథానాయకురాలు

Emilia—ఎమీలియా—అయాగోభార్య.

Bianca—బయాన్కా—కేశియో యుంపుడుకత్తె.

# ఒథెల్లో—వెనీసునగరపుమూరు.

---

# సతీసుందరి

కడుపుమంట—టంకపుఁబొందులు.

---

వెనీసు (Venice) పరిపాలకులలో నొకఁడును, భాగ్యవంతుఁడును నగు, బ్రబాన్షియో (Brabantio) కు నిధానస్థురాలు డెస్‌డెమోనా (Desdemona) యనునసుఁగు కూఁతురు గలదు. ఆమెకుఁ గల సుగుణగణములనుబట్టియుఁ బుట్టియుంటినుండి కొల్లలుకొల్లలుగ ధనమును దమకుదోఁచిపెట్టు నను యాశనుబట్టియుఁ బెండ్లికొడుకులు రకరకములవారామె కొఱకుఁబడిగాపులు పడియుండిరి. స్వదేశీయులును, నందమగు తోలుగలవారును, మిసమిసలాడు వర్ణములవారును, నామె కెవరును నచ్చలేదు. 'తోసిరాజు' అని త్రోసివేయుటయే నామెపని. మనోసౌందర్యమే యామెకుఁగావలసినది. అట్టియెడ దేహసౌందర్యము తరుగుగానున్నను నామెకుఁ బట్టింపులేదు. భువనైకమాన్యలీల నవతరించినవాఁడు (Othello) ఒథెల్లో. అట్టి మహనీయుఁడు, మాననీయుఁడు, మననశీలుఁడు, 'అతని

కతండెనాటియగు నీచతురబ్ధిపరీత మహీతలంబునఁ. ఆయనను జూచినవారెంతటి మానవుఁడే యీతఁడనువారే. ఆమంచి, ఆప్రతిభ, ఆప్రభ ననుకరించుట కితరులకుఁ గష్టసాధ్యము. సాధ్యముకాదనిచెప్పినను, నొప్పియగునుగాని తప్పుకాదు. ఒప్పులకుప్ప, మేలులకూర్పు. ఈయనను, నల్లనయ్యను, ఆఫ్రికాదేశస్థుఁడుమూరును,నీలమేఘనిభవిగ్రహుని డెస్డెమోనా,వరించినది. ముక్కుమొగమెఱుంగనివాఁడు,కాఁడీమూరు. ఈతఁడనిన నామె తండ్రికిష్టమే. అప్పుడపుడు భోజనమునకుఁగూడ పిలుచుచుండెడివాఁడు. ఇదియెక్కడి మోహము ? ఇదియెక్కడివలపు ? అనియామెను మనమునిరసనముచేయరాదు. ఒక్కనలుపువిషయమటుండనిచ్చినపక్షమున నట్టిగొప్పయిల్లాలునకు వెలితి మఱియేమియునులేదు. అతఁడుయుద్ధమునవీరుఁడు,శూరుఁడు,రణరంగఁడు,ధైర్యశాలి,రణరంగమున,నెదిరిప్రతివీరులతిక్కణఁచువాఁడు. వెనీస్‌కు టర్కీ (Turkey) మీఁద జరిగినభయంకరమగుయుద్ధములోనితని నిరుపమపౌరుషము,దొరతనపుఁగొలువులో సేనానిపదవి నితనినందించి,నమ్మఁదగిన మర్త్యుఁడుగఁ బరిగణింపఁబడుచుండెను.

బాటసారియై, దేశదేశములుచూచినవాఁడు. తానాయామెడఁగావించినఘనకార్యములవృత్తాంతములను, మేలైనగెల్పులను వినినయామెతనియెడు. జ్ఞాపకమునకువచ్చియున్నంత

వఱకు నేకరువు పెట్టినాఁడు. యుద్ధములేమి, ముట్టడులేమి, చెయి చెయిదూయుటలేమి, భూమిమీఁదను, సముద్రముమీఁదను, తానుగడచినముప్పులను, ఫిరంగులకాల్పులను, వెంద్రుకవాసి దూరమునఁ బ్రాణరక్షగావించుకొనిన వృత్తాంతములను, నొకశత్రువు వాఁడికడుపుపగులగొయ్యి, తనను జెఱఁబట్టి బానిసను గావించి, యమ్మివేసినదియును, తానక్కడనుండియెటులపన్నాగముపన్ని తప్పించుకొనివచ్చినదియును, క్రొత్తక్రొత్తదేశముల నాతఁడుతిలకించిన వింతవింతవృత్తాంతములను, యేమేమియోగుహలను, సారంగములను, కీకారణ్యములను, రాళ్ళపాతరలను, గుట్టలు, పర్వతములను, మొరటుజాతులు, నరమాంసభక్షకులు, ఆఫ్రికాఖండములోనియొకరీతిజనులు, తలలు భుజములక్రింద మొలచినవారు; యింకను నెన్నెన్ని యోయద్భుతములు నర్బుదములకొలఁదియునువిని డెస్డెమోనా తనియదు. చెవులునిక్కఁబొడుచుకొనివినుచుండును. ఈలోపుగనెవ్వరైనను గృహకృత్యములకుఁ బిలిచినయెడల నదేదియో, యయినదనిపించుకొని మూరుమెద్దకుఁజేరుకొనియాతరువాయి నాలకించును. తనజీవితములోనియిక్కడనొకగాథ, యక్కడినొకకథ, యక్కడియొకవధ, యిక్కడియొకవింత, యీరీతిగ వినిన స్వారస్యము పుట్టదు. స్థాలీపులాకన్యాయమును దాఁటిపోవలెను. ఇంతకును గాండములు ముగియవు; కలియవు. ఏకాండముగఁ దనయా

వద్వృత్తాంతమును,నొకేనోట నొకేకాలమున నామెకునేకరువు పెట్టుటకు,యాదాలాభమున నుండునపుడు మాటయిచ్చెను. ఒప్పుకొనినట్టే. ఏపట్టుకాపట్టు,నిండుతేనెపట్టు, శ్రుతిపర్వముగ, నోటిత్రుప్పు దుల్ల,నానుపూర్విగ వినినది,క్రోలినది. ఆమెముఖ వర్త్యస్సు మార్పులను జెందుచునుండినది. పడినయవాంతరము లను బేర్కొనినప్పుడామెకుఁ దెలియకయే బాష్పములుజలజల రాలుటయే పని. కథనిలుపుదలకువచ్చినది, ఒథెల్లో పడిన, పడరానిపాట్లకు నిట్టూర్పులుబహుమతులు. అత్యద్భుతచర్య లనినది. వినిన జాలిపుట్టుకొని వచ్చుచున్నదనినది. జాలియింత యంత కాదనినది. తానువినకపోయిన బాగుండెడిదనినది.అట్టి మానవుని దేవుఁడుతనకుఁ బ్రసాదముపెట్టిన బాగుండుననినది. అతఁడికిసలాముచేసినది. చేతులుజోడించినది. నర్మగర్భోక్తు లాడినది. మానుషముచెడలేదు. మానవంతకుమును పే,ఘనా ఘనముగనుండియే యున్నదీమానినికి.

"క॥ మానంబెతొడవు సతులకు
మానమెప్రాణాధికంబు మానమఖిలస
న్మానములకుమూలంబగు
మానరహితమయినబ్రదుకు మానినికేలా?"

అడఁకువ యుట్టిగట్టినట్టే యున్నది. నాలుకయున్నదిగదాయని

విఱుగఁబాటుతనము లేదు. మాంసముతిందురనితగుదునమ్మా యని,బొమికలను మెడకు తగిలించుకొను స్వభావముగాదు. అంతయును గుంభన, స్తంభన, చెప్పని,గిప్పని,విప్పని,యందము-నెఱయాదము; మందహాసము, మొగమును మూటఁగట్టినట్టున్నది. ఎంతటినగవు రాఁబోయినను,గకాపికి లేదు. పెదవిసడలనీయదు. బుగ్గలుమాత్రముబుకును, ఒకళ్లోకు నివియన్నియును గ్రహించుటకు బ్రహ్మవిద్యగాదు. ఇఁకనాతఁడు తనసోది విప్పినాఁడు. పెడత్రోవలితనికిఁ జేతకావు,వాతకాదు,వెలువడవు. ముక్కుకు సూటిగ వెళ్ళిపోయినాఁడు. రెండుకనులసందున నున్నముక్కు. డెస్డెమోనా యనినఁ బడిచచ్చుచున్నానన్నాఁడు. ఇంకేమి? శ్రుతిపర్వము శ్రుతపర్వము. ఆమెపంట పండినది. ఇంతకుమించిన తరుణము రాదు. కటినలుపు,మేలిమిబంగారమయినది. గాంధర్వముగఁ బెండ్లియాడుదు ననినది. అనినదికాని,ఒకళ్లోరంగు, పోసీ,యైశ్వర్యము రెండును నంతంతమాత్రమే. ఇంతపాటియల్లునిడెస్డెమోనాతండ్రి బ్రబాన్షియో,యొప్పునా? ఆతనియల్లుఁదనమును. కూఁతునకు స్వాతంత్ర్యమిచ్చినాననినాఁడు,వెనిసులోనికన్యలు,పడుచులు,స్వయముగానే,స్వయంవరములు సాఁగించుకొనుచువచ్చిరి,సాధించుకొనుచు వచ్చిరి; లైగా వేఁగిరించుకొనుచుఁగూడ వచ్చిరి. అమితపుటుద్యోగపుదర్జా, తలబరువు నిండుపాగకొలువు,రాజఠీవి,దొరతనపునీటు,లేక ముల్లైలసూటి,

లచ్చిపోటీ, యేమియో యీవిధమగుశయ్యలను, స్వయంవరణ ములూఁగిసలాడెడివి.

బ్రబాన్షియోయనుతనకుమార్తెయునిట్టిస్వయంవరణము వలయామున నే నిముడునని తలఁచెను. కాని తాఁదలఁచినది యొకటి, దైవనిర్మాణము మఱియొకటి. మూరునల్లనివాఁడు. అతనిశౌర్యమునకు, సామర్థ్యమునకుఁదనయాపేక్షయును, నదృష్ట మును నరికట్టివేసినది. దానేరికోరి తెచ్చుకొనిన మగఁడు. తన కంపు తనకింపు. ప్రేమ భక్తిక్రింద ముదిరినది. మఱియేయితర యాఁడుదానికైన నీనలుపు కాటుచిచ్చాయెడిది. ఈమెమాత్ర ము, తనతండ్రియింటివాకిటను గులాములయి, కిటకిటలాడుచు, చూరులనుబట్టుకొని వ్రేలాడుచుండు మగకుక్కలు, రంగు లకురంగులు, పింగులకుపింగులు, వన్నెలకువన్నెలు, చిన్నెలకుచిన్నె లు, ముద్దులుమూటగట్టుముక్కారుదినుసులవారు, యిందఱితల లనుదలఁదన్ని, యీమూరునే తనగుండెకాయకుఁ బ్రేమాపాశ ముచేఁగట్టివేసి కొనినది, వారివివాహము రహస్యముగ గాంధ ర్వమయినది. అబాంధవకృతముస్నేహప్రవృత్తివల్ల. చిత్రగాంధర్వ ముబాట. భార్యమాత్రమప్సరస. భర్తయో, రంభవలచిన యు తఁడేనలకూబరుఁడు. రహస్యమెంతకాలము? ఆలుమగలపోడు ములు జరుగవలయునే? తుదకు ముసలివాని చెవులలోఁబడిన ది. శివమెత్తుకొనివచ్చినది. తలయెత్త గోఁతగాదే నాకనును.

అనుకొనును,గుంజుకొనును. వాఁడిచొక్క చీల్పింతుననును. దొరతనముమీఁదికి నురుగుల్గ్రక్కుకొనుచు వచ్చినాఁడు. మూరుమీఁద నేరముపెట్టినాఁడు. తనకుమాత్రె మానరక్షణ ము దొరతనమువారి యరచేతిలోఁబెట్టినాఁడు. ఈతురక వేప ప్రమాను నాకుదాపరించినదే యనును. మాయోపాయములు, మహేంద్రజాలములుతనగర్భవాసముమీఁదఁబన్నినాఁడీమూరు. అవన్నియునామె నావహించినవి. అంతటిసౌగసుకత్తెయును బెండ్లిలోఁ బడినది. పప్పులోఁ గాలుజాఱినది. తనయొప్పుదల, తనతోడు,తనయమ్మతోడు,లేనేలేదు. ఇంటికప్పుడప్పుడతిథిగ వచ్చినట్టేవచ్చి,కడుపుబ్బఁదిని,చేపట్టినాఁడు.

ఇదేసమయమున వెనీసుదొరతనమునకు, ఒథెలోసేడయ యినను, ఛాయయయినను, దుదకుఁబేరుమైననత్యావసరమయి నది. తురుష్కులతియాడంబరముతో, సముద్రయుద్ధమునకు నాయితపడిరి. వారిపట్ల గెల్పు సిద్ధాన్నమే మో యనుపించినది సైప్రసుద్వీపమువైపునకు వారిసైన్యము వచ్చుచున్నది. వెనీసు నువారియొద్దనుంచి బలాత్కారముగఁ దిరిగిపట్టవలెను.పట్టుమట్టు పట్టవలయుమట్టు. చేవమట్టు. వెనీసుకుముప్పుసమయము. ము ప్పుత్రిప్పలుపడి త్రాగుటకు మూఁడుచెఱువులుకావు. చుట్టు ప్రక్కలనుజలసూత్రమే యావరించియున్నది. ఒకానొకప్పుడా సూత్రమేప్రళయమును జుట్టఁబెట్టును. రత్నాకరమునకుఁదగిస

కర్ణధారుఁడుండినచో,గోటీతయే. చిట్టీతకాదు. అందఱికను లును,ఒథెలోమీఁదఁ బడినవి. సమరనిశ్శంకసాహసాంక,సంగ రరత్నాకరరత్నధారుఁడీతఁడుతప్ప యొరులు లేరనిరి. ఒరులు లే రరనిరి. దొరతనము,ఒథెల్లోను బిలిపించినది. ఒథెల్లోకు దశప ట్టనున్నది. దశ పట్టించనున్నది.

ఇటొక నేరస్థుఁడువలె, తలకొట్టి మొలవేయు నేరములు చేసినాఁడు, ఒకకంటఁబొలు. ఒకకంట నెత్తురు. బ్రబాన్షియో వయనునఁ బెద్ద. వెనీసునుబరిపాలనముగావించు తంత్రులలో నొకఁడు. తీఱియున్న నిండుకొలువున నీయయ్య విన్నపములఁ గడుశ్రద్ధాన్వితులుగ నాలకించిరి. పాలనమాటయేమియో గా ని,యాలనమాత్రము కావలసినంత. వినసొంపెక్కినకొలఁదియు ను గోపోద్దీప్తుఁడగు తండ్రికి వేఁడియెక్కి నిందలను,బదింబదిగ బదునుమించిన ధాటిని మోపసాఁగెను. అరేబియాదేశపుటశ్వ ధాటియే. ఋజువులకు మారుగ నేమోయను సంగతులును, నభాండములను బడవైచెను. ఒథెలోను లేవమనినారు. నిలఁ బడు మనినారు. ఏమి సముజాయిషీ? అనినారు. ఉత్తరకాం డకు దిగుమనినారు. లేచినాఁడు. నిటారుగ నిలఁబడినాఁడు. టూకుటీకేమియో నెఱుగఁడు. నదురుబెదురునహి. చెక్కుచె దురు లేదు. మెఱుఁగు లేదు. నిగారింపు లేదు. జరిగినది జరిగి నట్టు చెప్పినాఁడు. వలపు తేఁట. తేఁటవలపు. సాచామాట.

సవ్యసాచి. మాటనిజమేకమ్మఁదనము. ప్రధానన్యాయమూర్తి (Duke) విని, బాగున్నది. మేలుమేలు. ఇట్టికతలు తనకూఁతును గూడ బుట్టలో వైచుకొనునే? అనెను. ఒథెలో యుపయోగించిన మంత్రతంత్రములన్నియు నతనిసద్గరిమ, సన్మహిమయే. అసత్తు యిక్కడ లేదు. భూతవిద్య, భూతవిద్య, యందురు. ఉన్న జగన్మిథ్యా. ఏమియును లేదు. జరగినవృత్తాంతమును జరిగినట్లు, యతిశయోక్తి, వక్రోక్తి, ఛలోక్తి, యన్యాపదేశముల చెంతఁ బోక చెప్పుటయే. ఆమె చెవులకు బాగుగనెక్కినది; నచ్చినది.

ఇదియే మదియేమి? నకలునకసలే, యువతలకూడిపడినది. డెస్డెమోనా, కొలువుకూటమున, న్యాయకూటమున నిలఁబడినది. తండ్రివైపుఁజూచి నోటఁ బచ్చివెలగకాయగుజ్జున్నట్టున్నదనినది. విధాయకము రెండుపాయలయినదనినది. తనప్రాణమునకును, జవసత్త్వములకును, విద్యాబుద్ధులకును, తండ్రిఋణమును దానుదీర్చుకొననేరదనియుఁ, దండ్రిమెడాటమునఁ దనకుఁగల మన్ననకు మితిలేదనియు, నన్నిసదువులసారము, మర్మము నిదియే యనియు, నదిదాఁటి మఱియొకపరిస్థితికి వచ్చుసరికి, వెనుకటి కన్యకాపదవి మాఱి యొకయయ్యచేతిలోఁ బడితిననియు, నట్టివాఁడే, నాథుఁడంటు, మగఁడంటు తలయెత్తుదురనియు, నీతిపి దేనికిని లేదనియునునసెను. మాటలుపెక్కులతోఁ బ్రయోజనము లేదు. వేఱెలోకముసంగతి తనకెందుకు? ఇతరులసంగతి తనకెం

దుకు ? తనజననియే తనకాదర్శము. తార్కాణ. ఆజననితన తండ్రినివిడిచి,మాయయ్యను జేరుకొనలేదా ?

బ్రబాన్షియో,తనపట్టుపట్టులేనిదనియుఁ బటుత్వములేనిదని యు,నిరర్థకమయినదనియుఁ దెలిసికొని,యల్లునిఁబిలచి జరిగిన దానికి వగలమారివంకాయవలె నయి,శగపొంత్రమగ్గియేతీరి, నెమకి,సమసి,గత్యంతరములేక,యామూరునకే కన్యాదానము చేసినాఁడు ; ఫలప్రదానముగావించినాఁడు. అవకాశమెంతయు న్నను,అన్యథా యీశుభకార్యమును జరపెడువాఁడే. ఇంకను బిడ్డలు తనకులేనందులకు మనసులోపల నతఁడుసంతసించినాఁడు. కూఁతురుత్రొక్కిన యీపుంత,తననునొక్కకరోకటకునిగఁ గా వించెడిదనియుఁ దనచేఁబడలేక వారుతనపొత్తుననుండి లేచిపో యెడివారనియుననెను.

మూరునకీగండముగడచి పిండము బయటపడినది.యుద్ధ సన్నాహమతనికిస్వతస్సిద్ధము,సహజము. అందలికష్టనిష్ఠురము లతనికిఁ బరిపాటి. నిత్యనైమిత్తికములయియుండినవి ; నైజమ నీష, రూఢియయినవి, నిరూఢియయినవి—ఇతరమనుష్యులకు మెతుకు కునుకు యెటులనో. సైప్రసులోని యుద్ధములకువల యునిర్వహణభారము తననెత్తిమీఁదఁ బెట్టుకొనినాఁడు. జాగు కానిచ్చులేదు. క్రొత్తపెండ్లికొడుకు. సౌఖ్యరసైకలోలుఁడయి యింటఁగడపవలయుకాలము. గడపదాఁటక యింటమురియవల

యుకాలము. రాజాకాలము. క్రొత్తవింతకాలము. ఒకరినొక
రు విడిచియుండుకాలము కాదు ; కొంగుముడి వేసికొనెడికా
లము. దేశసైమోనామాత్రమవ్యక్తురాలా యేమి ? మగడుదం
డుకు వెళ్ళినఁ బేరువచ్చును. అపాయమొకింత యుండకపోలే
దుగాని, మగఁడుతనధీరుఁడు,తనధవుఁడు,తనమాధవుఁడు,యుద్ధ
మునకు వెళ్లుటకు మనసార యొప్పుకొనినది. ఉత్సాహపూర్వక
ముగ వెళ్ళిరమ్మన్నది. కొండనాలుకకుఁ గబురందిననాలుక
తోనే వెళ్ళిరమ్మన్నది. తానును వెంబడిన యుండును.

నూతనదంపతులిరువురును, బయలువెడలిరి. సైప్రసు
రేవున లంగరువేసినారు. మెట్టకుఁజేరుకొనినారు. ముందుకా
ర్యమునకుద్యుక్తులుకాకపూర్వమే శత్రునావికదళములు, ప్రచం
డమగు తుపానువలన, చెల్లాచెదరయినవనియు, నీసైప్రసుదీవి
కప్పట్లో శత్రుభయములేదనియు వర్తమానమువచ్చినది. కాని
ఒథెలోమనసున నింకొకధోరణి యుద్ధమువిత్తనములు పడను
న్నవి. చల్లనున్నారు. విత్తినున్నారు. రవరవలు వారిద్దఱినడు
మను బడనున్నవి. తనశత్రువులసూయాపరులు తనకును దన
భార్యకును వేఱుబంధములు చేయుపాశములు ప్రాణాంతకమ
గు,మరణాంతకమగు పాశములుకానున్నవి పేనుచున్నారు,పన్ను
చున్నారు. ఒథెల్లోయింతవఱకును బడినవన్నియు నష్టకష్టములు
బహిశ్శత్రువులు,పరాయివారు మతాంతరులవలనఁ గలిగినవి.

ఇఁక మీఁదను రాఁబోవునవి తనతలనాలుకయనుకొనిన తన నట్టింట,తననట్టనడుమను మసలుపగవారివలనఁ గలుగనున్నవి. తననాలుకన ముల్లువిఱుఁగనున్నది.

ఒథెల్లోకు హితులు, స్నేహితులు పెక్కుమందిగలరు. కేశియో (Cassio) యనువానిమీఁదనమ్మకము, నెఱనిండు నమ్మకము. మిగిలినయందఱును,ఆకులుతగ్గఁగఁ జదివినవారలే. క్రిందిచేతులే. మైకేలుకేశియో (Michael Cassio) తెపతెప లాడు వయసువాఁడు,సిపాయి,ఫ్లారెన్సు (Florence) దేశము వైపువాఁడు ; ఉల్లాసి, మంచిసరసుఁడు, మొగముగరగరికలేక, చూచువారికివేడ్కఁ గలిగించునడవడి. ఆఁడువారికిట్టిగుణము లనిననిష్టము ; చెవి కోసికొందురు. మనిషి రూపరి,చూపరి ; చమత్కారముగ మాట్లాడును. ముద్దరాలు,అందకత్తెయునగు పడుచునకు, వయసుమీఁజినమగనికిట్టిపరిస్థితులు, అసూయను అనుమానమును బొటకరింపఁ జేయకమానదు. ఒథెలో గభీరుఁ డు ; గంభీరుఁడు ; ఉదారుఁడు ; ఉదాత్తచరితుఁడు. అనుమాన మునకు నతనికిఁ జాలదవ్వు. నీచపుగార్యమును జేయుదురని యెవరిని శంకింపను, శంకింపఁడు. తలపంకింపంతకుమును పే లేదు. సాచా సవ్యసాచి. ఇంతకుఁబూర్వము జరగియున్న డెస్డెమో నాకునుదనకునుమధ్య,ప్రేమపుసొక్కులకును,సోలింతలకును,తూ లింతలకును,దొర్లిగింతలకును,మధ్యమధ్య సారథిగ నీకేశియోను

వేసినాఁడు. కాదుకాదు; రసరథము, సంజయరాయభారమా? పుల్లాయవ్యవహారమా? మదనరథమును, దనమనోరథమును గమ్యస్థానమునకుఁ జేర్చుటకు కేశియో తరువాతనేయెవరైనను. పుష్పకోమలులయొద్ద నతికోమలముగ,మనోహరముగమాట్లాఁ డుటకీతనికిఁ బెట్టినదిపేరు. అయోమయపుమాయయగు తనకుఁ జేతకానిపని. కట్టె, కొట్టె, తెచ్చె, మాదిరియేకాని, నిగారింపు, సింగారింపు, కంజాయింపు చేతఁ గాదు. అందువల్ల డెస్డెమోనా యొద్దకు కేశియోను బంపుచుండెను. ఒథెల్లోన రత్నమున నిది యొకకళంకముగ నెంచఁజనదు. శుద్ధయమాయకుఁడు. ఇది యొక గొప్పగుణమే. మగఁడుచదివిన యాకుననే భార్యయుఁ జదివినదియనిన వింతయుండదు. దొడ్డయిల్లాలు. బుద్ధిమంతు రాలు. నిప్పునకుఁజెదలేయుగముననైన నంటునా? ఏటిమాట లు? అనిగట్టిగ ననుకొనిన మగనాలు. కేశియో యనినమగని కెంతప్రేమయునమ్మకమో, తనకునునించుమించుగ నంతయే. ఇద్దఱకును ముడిపడినతరువాతకూడ నీజాయాపతులు కేశియో యడల నదేరీతిని మెలఁగుచువచ్చిరి. కేశియో తరుచు వారి యింటికిఁ జేరుకొనుచుండును. వటవట వాగును. మనసునఁ గల్లయుఁగపటము నుండనే యుండదు. అనినమాట తిరిగియనఁ డు. పలికినఁబలుకు తిరిగిపలుకఁడు. చెప్పినయుబుసు తిరిగిచెప్ప డు. విప్పినకవిలి తిరిగివిప్పఁడు. పాడినపాట తిరిగిపాడఁడు. ఆడిన

పదము తిరిగియుండదు. అందువలన ఒథెలోకువినుటకొన్లెదక రముగనుండెడిది. తానుమాత్రముగంభీరుఁడే ; గంభీరముగనుం డువాఁడే. ఎప్పుడును గనుబొమలు ముడివైచుకొని యుండువాఁ డు. కేశియో దగ్గఱనుండు కొంచెముస్నేహైన నతనికివిరామ ముగ నుండును. వ్యత్యాసస్వభావములుగలవారలొకరినొకరు కండ్లకు నద్దుకొందురు. మనసులను సర్దుకుందురు. అదేవిధము గ డెస్డెమోనా, కేశియోలుకూడ మాంటలునవ్వులు, నవ్వులు పువ్వులు, పెండ్లికిఁ బూర్వమునాఁటివలెనే.

ఒథెల్లో సేనానిగదా. తనతరువాత, తనయంతటివానిగ, మఱుసేనానిగ,మాఱుసేనానిగ నీకేశియోను మెట్టెక్కించినాఁ డు. ఒకమెట్టెక్కినవాఁడొక్కఁడున్నయెడల, మెటికలువిఱుచు వారు పదిమందికిఁ దక్కువయుండరు. భగభగ మండువారింక నుమెండు. అయాగో (Iago) మూలవిర్నాట్టు ; ప్రాఁతపందికొ క్కు,గాదిక్రిందిపందికొక్కు,వయసునఁ బెద్దవాఁడు. కేశియో యున్నతికిఁ గుమిలిపోయినాఁడు ; యేడ్చినాఁడు. తనకుఁ గావల యుపని కేశియో కాఁజేసినాఁడు. వార్ధకము తనది ; చాకచ క్యము తనది ; ప్రాఁతచెయ్యి తనది ; మేలుచెయ్యి తనది. కేశి యో యెక్కినమెట్టునుంచి దించుటకుఁ దనతరముగాదు. ఏడ్పు లు,పెడబొబ్బలయినవి. ఇఁకఁబరిహాసము, గేలి తనకుండుకున్న నిండుసరుకు. రోషముపట్టఁ జాలక,దుఃఖముకట్ట కట్టఁజాలక,

కేశియోను,ఆడంగిలేకి యనును. ఆడంగులలోఁ బెదభావగా రనును. యుద్ధముగిద్ధము చెప్పఁగిప్పరాదు. అతివాగుడు, అతిధోరణి. పని యనుభవము లేనేలేదు. సేననుయుద్ధమున కేర్పరించుటకూడ చేత,వ్రాత కాదు. ఒక బాలికకెంత తెలియునో,తనకు ను నంతపాటియే తెలియును. అయాగోకు, యీ కేశియోను జూచినఁ బచ్చగడ్డివేసిన భగ్గునన మండును. ఇద్దటినడుమ పెట్టిన పూరి కాలును. ఒథెలోయన్నను న్యుగ్రావేశమే,క్రోధావేశమే—కేశియోకు పదవియెక్కించినందులకు. అయాగోయగు తనకటువంటియందకత్తెయగు భార్య ఎమీలియా (Emilia) దొరికినది. చూచుటకు, కేశియోముచ్చటపడుటఁ గని దానిపైన, అయాగో,యేదియోనొక యనుమానపు,అమానపుఁజలువచప్పరము వేయనారంభించినాఁడు. స్థంభముహూర్తమయినది—అన్నిఁటికిని. లగ్నము చరచరలగ్నము. ముప్పదియాఱుగంటలలో సాంతము కావలయును. ఒలికిలకాఁడు చేయఁదలఁచుకొనినవాఁడు. కంకణముగట్టుకొనినవాఁడు. అయాగో; తానొక మైరావణుఁడు—కపటక్రియాదక్షుఁడు.

ఇవియన్నియును,అయాగో లోపలనున్న యులుకులు. అనుకొనిన యులుకులు. తనమనస్సును గలుక్కుమనుపించినవనుకొనిన యులుకులు. బైటవేసికొనని యులుకులు. లోపలిస్వయంపాకము ; స్వయంకృషి. స్వయంరాజా,స్వయంమంత్రీతథై

వ. మనసు కుట్రలకుట్టు. మీఁగాళ్ళవాపు మొగముమీఁదఁ గననియ్యఁడు. మనస్పర్థలనుకొనిన,ననుకొనవలసినవి యివి. వీటినుండి చిలువలు,పలువలు,పువ్వులు,పిందెలు,కాయలు నేమేమియో వేయనున్నాఁడు. అత్యద్భుతమగు,నతిఘోరమగుసాంతముఁ జూచువారికి,వినువారికి,గుండెలను బాదుకొనునట్టుచేయునట్టిబ్రహ్మాండపుఁగుట్రను,అయాగో పన్నఁబోవు చున్నాఁడు. కుట్ర—అల్లుసోమయాజులు కాఁబోవనున్నాఁడు. పైకిమాత్రము వేదబుక్కులే. వేదఘోషయే. ఉపనిషత్సారమే. భగవద్గీతలే. కొంపల నొక్కుమ్మడి గూల్చనున్నాఁడు. నిప్పునకుఁ జెదలనంటించ నున్నాఁడు. చెద నిప్పును దినఁబోవుచున్నది. కందిపప్పువలె బొక్కనున్నది. శనగపప్పువలె కరకరలాడించుచున్నది. కేళియో ఒథెల్లో,డెస్డెమోనాల నొకసుడిగుండము లోనికీడ్చుచున్నాఁడు. కడుపుమంట—టంకపుఁబొడులు. వీనివిజృంభణమునకునంకురములను,అంకుశములను, అయాగోహృదయవేణూనాదము,శ్రుతి, రాగలయతాళములను, ఆయనిగీతవాయిద్యమే వినినఁగాని తరువాయిపల్లవి, కృతి,గాత్రము యాకృతి తెలియనేరదు.

నగరిలోని మూఁడుపెద్దపెద్ద తలకాయలు స్వయముగ నొథెలోయొద్దకు వెళ్ళినారు. అంగీలు లుంగీలు కట్టినారు. బట్టలగుడ్డటము లయినారు. ముస్తాబయినారు. వంగివంగి

సలాములమీఁద సలాములుపెట్టినారు. 'అస్సలామె ఆలైకుం' లకుమితియు విఱుగడయు లేదు. నామాటతలపెట్టినారు. నా కింకొక పిడికెడుభిక్షు పెట్టుఁడనినారు. నావిలువ నా తాహతు నాకుఁదెలియదా? ఆ సేనానికిఁదగ్గునట్టిపని నాదగ్గాకు లేనేలే దు. కాని ఒఖలో తనడొంకతనది. ఇంకొకత్రోవ గిట్టదు. మార్చినఁ దనగరువంపు నెఱజాణతనమునకు లోటు. లోపలి యుద్దేశములుండకపోవు. కేశియో యక్కఱకువచ్చినచుట్టమై నాఁడు. నేనేమో వారియక్కఱకురాని చుట్టము; పరాయిపు రుగు. వచ్చినపెద్దమనుష్యులను సాఁగనంపును. మరియాదలు మెండుగఁజేయును. ఖాలీలేదు. వారువచ్చినపని శూన్యము. కాళ్ళశని. మాటలుమాత్రము పెచ్చుపెఱిగినవి. అయ్యో! తీరావేఱొకమనిషిని వేసికొంటిమే? వచ్చినవారిమనస్సులు విఱిగి వారివారియిండ్లకుఁజేరుకొనిరి.

"ఎవరయ్యా,ఆపురుషుఁడు? కలముపోటేమైననుండునో లేదోచెప్పఁజాలను. కావలసినంతకత్తిపెత్తనము. పొన్నుకత్తి. విఱుగుడుచేవరంగు. చేతికలంకారము. ఎవరో,యెవఁడో యు నామకుఁడు. మైకేలుకేశియో, ఫ్లారెన్సుదేశపువాఁడు. పెండ్లా మమాత్రమతనికిఁ దగనియందకత్తె. యుద్ధమునఁ బద్మవ్యూహ ములఁ బన్నుట తెలియునా? అక్షౌహిణులనేర్పరింపుపని యే మైననున్నదా? గ్రంథస్థమగు యుద్ధశాస్త్రము, అస్త్రశాస్త్రము

ముఖస్థము,కంఠస్థము పాఠమయియుండవచ్చునుగాని యేమిలాభము? వాగ్డంభము,వాగాడంబరము,పయిపొటకరింపు. ఆయనగారి సేనానీగిరి యిది. చూడండి. అయ్యావారిది యదృష్టము చలాయించినది. పైవారి మెహార్బానీలోఁ బడినారు. నేనో! ఆయనిపనులు రోడ్సు, సైప్రసు,యింకా యెక్కడెక్కడో, మన మతమువారు,మతాంతరములవారి గడ్డలమీఁద నాకళ్లారఁ జూచినాను. నాకీయుద్యోగము రానందులకుఁ బ్రతివాఁడును నన్నోదార్చువాఁడే. ఆయనది మంచికాలము; అదృష్టవంతుఁడు. దొప్పక్రింది దొప్పను నేను. అడుగునకుమడుగులొత్తుచు నాతలమాసినవానిక్రింద నే నొదిగియుండవలసి వచ్చినది. నా కర్మము కాలిపోను. నేనామూరుగారి బావుటాకాపుదాగీ వాఁడను. నానోరు రెండుచేతులతోడను మూసికొని యూరక యుండవలయును. నోరుమెదిపిన లాభము లేదు. మాటఖరాబు. ప్రతివిధానము లేదు. ప్రతిక్రియ లేదు. మాఱుమంత్రము లేదు. నదుమంత్రము,కల్మికిమాత్రమున్నది గాని,శనిగాఁడికి లేదు. స్థిరోభవయని నేను చదలుపట్టవలయును; మన్నుదినినపాము కావలయును. కొలువు తలవ్రాతయిదియే. కొలువు తలవ్రాలిది. ఉత్తరములు,ఆపేక్షలు,మెట్టుమెట్టుకు,చీడీచీడీకి, యెత్తుయెత్తుకు వంతుకువంతుకు, వన్నె యెక్కించును. వాసి యెక్కించును. పసిమి కలిగించును. రశ్మి సోఁకించును. కొలువుపెద్దతికము,

పనిచాకచక్యము,యివి యనవసరమిప్పుడు. అప్రస్తుతప్రశంస, లేనిపోనిగొడవ." ఇట్టిసందర్భమున,మూరుమీఁద అయాగోగారికి,సచ్చగడ్డివేసిన భగ్గుమనినట్లుండినను,వానిమచ్చమాపుటకు, దుంపద్రెంచుటకు, త్రాడుద్రెంచుటకు నదనుకుఁబడిగాపులు పడియుండుచు వచ్చెను. "అందఱు నందలములనెక్కువారే యగు పక్షమున మోయువారెవరు? మోయువారందఱును స్వామి యెడ విశ్వాసముగలవారేనా? రూపాయిబిళ్ళలకొఱకుఁగాని. మొగముమాట్లాడుచుండిన నోసలువెక్కిరించును. చేసెడిది నీచసేవ యని తెలియును. ఉడిగంపు సేవ యని తెలియును. కంచి గరుడసేవయా? పొన్నమానువాహనమా? కానిభక్తిప్రాసాదములపరిమితములు. పైకినతివినయము. అతినయము. అతి వినయముధూర్తలక్షణముగదా. అడుగునకుమడుగులు, దాసత్వమున,నుదాసీనత్వమున మోకాళులు వంగవలసినవియే. కాలము వెళ్ళఁబుచ్చవలెను. గాడిదలేదా? బరువులుసాగించుటయే దానిపని. చేసినంతవట్టుయును దాణాకు లోటులేదు. వయసు ముదిరి,ముతకయయి,మెతకయయి పనికిరాకపోయిన నెట్టివే యుదురు. అటువంటివెధవలను నా పేరుచెప్పి మఱియొకతన్ను తన్నుము. ఒకరకముమనుజులు వీరు. ఇంకొకమాదిరి వారున్నారు. వినయవిధేయతలు,భయభక్తులు,భక్తివిశ్వాసములు తమయజమానులకుఁగురిపించుచు,మెఱిపించుచు రూపాయిబిళ్లలు

బొజ్జునకుఁగట్టుకొనుచు నోంటికి కండపట్టించుకొనుచు బాగుపడువారు. అట్టివారిలోనివాఁడను నేను. పైకి నటన, లోపలి స్వయంపాకము తయారగుచునుండును. జీర్ణం వాతాపిజీర్ణం. నాది స్వలాభము. చేయఁదలఁచుకొనినపనికి నాకేనవ్వువుట్టుచున్నది. చేతిమీఁదియుంగీని మాటుపఱతును. లోపలి 'నేను' వేఱు. పయివాఁడు మఱియొకఁడు. లోపలిది తనాబీ. పైది మతాబా. కంచుకాఁగడ వేసి వెదకినను లోనిగుట్టు బయలు పడనియ్యను. పాకముస్వయముది ; స్వకీయము. పచనమగు వటుకను దెలియనియ్యను.

"ఉ॥ ఏవిధినైనఁజుట్టికొని యేఁజలపట్టి * * నా
నావిధలీలలం గపటనాటకముల్ప్రచరించి ధైర్యల
క్ష్మీవిభవంబుమాపి చలచిత్తునిఁజేసి"
యేమేమియో చేయుదును ; చేయింతును."



# ఒథెల్లో—వెనీసునగరపుమూరు.

---

# సతీసుందరి

## 2—గుండెనంజు—ఇటుకకాల్పులు.

---

"క॥ తలనుండువిషము ఫణికిని
వెలయంగాఁ దోఁకనుండు వృశ్చికమునకుం
దలతోఁకయనక నుండును
ఖలునకు నిలువెల్లవిషము గదరా."

అయాగో, అతినేర్పరి. మనుష్యతత్త్వములోఁతు, పాతు, గుట్టు మట్టు సన్నియును గాఁచి వడియఁగట్టినవాఁడు. మనుజులకుఁగలుగు బాధలలోనెల్ల భార్యమీఁది యనుమానము పురుషునకుమనసున యమబాధకలిగించునని తెలియును. కేశియో మీఁద, ఒథెలోకు నీలీల నెక్కించినపక్షమున, నెఱవేరినపక్షమున నొకవిశ్వామిత్రసృష్టియే. కసి కొనముట్టును; కడ తేరును. తుద కెవరుపోయినఁ దనకేమి? కేశియో, లేక, ఒథెల్లో, లేక యిద్దఱును నేగంగలోఁగలసినను, దనకడుపుమంట యారును.

సేనానాయకుని, ఆయనిభార్యయొక్కయు సైప్రసుద్వీపమునకు రాకడయు, శత్రునావికాదళములు చెల్లాచెదరగుటయు

నాద్వీపమునందంతటయును బండుగవలె నయినది. ప్రతివారి యింటను బిండివంటలే. ఉల్లాసముగనుండువారే. కేశియోకు మాత్రమూరాత్రి కాపుదారీపని నంటఁగట్టిరి—సిపాయీలకుఁ ద్రాగుడు హెచ్చుకుఁ బోనియ్యకుండుట. హెచ్చు మతివిఱుచును. కొరానిపనులఁ జేయించును. అచ్చటిప్రజలు హాడలుదురు. ఈమిడుతలదండు తమకొంపలను ముంచుచున్నదే యనుకొందురు. ఆరాత్రియే,అయాగోగారు పడగవిప్పుచున్నారు.

ఆమూరు,అంటే నాకు తలనొప్పి. కానినేననిన నతనికి మంచియభిప్రాయము. నమ్మకము తలమున్కలుగ మిక్కుటము. సత్యమూర్తినగు నన్నువిడిచిన లోకమున వేఱొక్కఁడులేఁడని నమ్మును. అందువలన నా కన్నము మఱింతఁజక్కఁగఁ బొఱును. కేశియో తత్త్వము నా సవారికి సరియైనది.ఒక్కసారిపాఱ జూతును. అతఁడియుద్యోగమునకు సలసలమెసరు వేసెదను. కాఁగఁబెట్టెదను. కాక మెక్కించెదను. ఊదరఁబెట్టెదను. నా మనసులోని తలఁపులనన్నిఁటికిని చలామణిగావించుకొనియెదను. వానిని 'ఘర్కుచలో' అనిపించెదను. నేనెవరు? అయాగోగారు. సత్యమూర్తులరని యితరులచే జోహారువులు పల్లవులు పాడించుకొను, అయాగోగారు. ఒకబాణముతో రెండుపిట్టలు, రెండుపిట్టలుకాదు,సామెత యబద్ధము. ఎన్నెన్నిపిట్టలు, పిట్టల గూళ్లూచముట్టుగఁ గూలునో! ఎలాగు,ఎలాగు. తిరిగి యింకా

కసారి చూతము. ఒకింత కాలమును జరుగనియ్యవలయును. ఒథెల్లోచెవికిఁ గారెక్కించవలయును. గూబగుయ్యిఁ మనిపించ వలయును. చాలముచేసినట్లు చేయుదును. చెవినిఁగుట్టివేయు దును; కొట్టివేయుదును; కొఱికివేయుదును. ఇదేమదేమి? తినివేయుదును. తనభార్య డెస్డెమోనాతో కేశియో, కారాని కాఁగూడని చనవుగ నుండును—ఈవిత్తనము ముందువిత్తుదును. ఇఁకఁజెప్పనక్కర లేదు. ఆకేశియో, ముఖారవిందము, విగ్రహము శిరీషకుసుమపేశల నాదుసుధామయోక్తులు, మృదుతల్పతయు నెనుటివారికాతనియడల నేమో యనుననుమానముపుట్టించును ఆవలియూఁడువారి మానము దిగజాఱినదే మో యనుపించును. అటుపూరు, ఉదారస్వభావుఁడు, అతిభోళామనిషి, పైకిశ్రీరంగనీ తులునుడివిన నట్టియాతఁడు సత్స్వభావముగలవాఁడని త్రికరణ శుద్ధిగ నమ్మును. ఎటులనీడ్చిన, నటుల సాఁగువాఁడు. ముకుఁ ద్రాడుపట్టి యీడ్చువాఁడిదే తెలివి. ఆయనిదేమున్నది? నేఁ గనుగొంటిని—అను, పాను, అనుపానము. విత్తనము మొలకలెత్తి నది. ఉద్యోగపర్వములోఁ బడినట్లేను. చేయవలసినది యమ కార్యము. మాయనడకలు నడిపించవలయును. గుబగుబ పరు గులెత్తించవలయును. నడినిశారహాస్యము. ఇవన్నియును మమే కమయినయడల, రాకాసిపనులు పట్టపగలిఁటివెల్తురున నిజతలల నెత్తును. గరగలను వారివారితలలపై నెత్తి గజ్జలను గట్టుకొనఁ

జేసి, చేతికిఁగంకణముఁ వారిచేతనే గట్టించి,ఆవేశములఁబూనిచి యాటల నాడించెదను. రక్తికట్టించెదను.

కేశియో:ఈ,అమ్మగారనినఁ దగనియాపేక్ష. అంతవఱకు నేనుగట్టిగ నమ్మెదను. కేశియో:యనిన నమ్మగారికినెనరంతకి కరణములెక్కుడు. ఇదితగియున్నది. మెచ్చుకొనఁదగియున్నది మూరుమూరనిన నాకుబారెడుమంట ; ఆరనిమంట ; వాఁడిని దగులఁబెట్టవలయునన్నంతమంట ; తలకంటకము. అయినప్పటి కిని యేమాటకామాటయే, ఆమనిషియొద్ద సుగుణములును నున్నవి. నిలకడకలవాఁడు ; ప్రేమాస్పదుఁడు ; గొప్పబుద్ధిగల వాఁడు,ఉదాత్తస్వభావుఁడు. అన్నిఁటికిని నెక్కుడువిశేషము డెస్డెమోనా,యెడల మిక్కిలిప్రేమఁగనబఱచు మక్కువమగఁ డు. నాకుమాత్రమామెయెడల నాపేక్షలేదా? అనురాగము లేదా? కానువికారముకాదుచుమిూ. 'కాయేనవాచా,మనసేం ద్రియైర్వా।బుద్ధ్యాత్మనావా,ప్రకృతేస్వభావాత్' ఏమియనినను చేసినను బుచ్చి పురుగులు కారిపోవుదును. కాని, 'నిమిత్తమా త్రంభవ'అని మాఘాయ శ్రీకృష్ణభగవానులవారి యాజ్ఞానుసా రము నటింపవలసివచ్చినది. నాకున్నదంతయును మూరుమిూఁద నే-కసి,తీర్చుకొనవలెను. ఆరవలెను. ఊరిశని,వీరిశెట్టిమిూఁదు గఁ బోవలెను.

నాకుఁగావలయుపనిలో కేశియో,ంఁరికినాఁడు. అయో

ధ్యాకాండలోఁ గులుకుచున్నాఁడు. ౹తాటిచెట్టు పెఱుగదా ?
ఎందువచ్చినవయసు, యీఁడునాకు. నాది బాలనాగన్న కాం
డము. నాకర్మము, నేనెన్నఁటికినిమర్యాదరామన్ననుగాను. గుంట
పువ్వులుపూఁచియే తీరవలయును. ఎదుగుబొదుగుయునులేదు.
ఈతలఁపుమనసునఁబొడిన యెడల నధికతరమైనపరితాపము క
లిగి నాబొమికలనుగొరికి తినివేయుచున్నది. పాషాణమువలె
లోనికి దిగుచున్నది. అందువలన మగఁడుపెండ్లాములకు వేఱు
బంధనములు గావించిధ్వంసముగావించినఁ గానినామనస్సునకు
స్థిమితముండదు. తృప్తియుండదు. సంతుష్టియుండదు. కండకుఁ
బుష్టికలుగదు. ఇదంతయు నెఱవేరినపక్షమున, మూరుమనసున
ననుమానముగట్టిగ నెక్కించెదను. దానితో మతివిఱుఁగును.
తెలివితేటలు బుగ్గిగలయును. ఇదంతయును గొనముట్టించు
టకు, వెనీసుపట్టణమునకంతకును, బనికిమాలినవాఁడున్నాఁడే
మైకేలుకేశియో, వానిని యుసికొలుపుదును. వానినివెంటనే
పడఁగొట్టుదును. నేఁబన్నినవలలోఁ బడవైచుకొందును. మూ
రుకువానిమీఁద ననూయకలుగునట్లు, విఱుపుడుమాటల నా
డుదును. నడవడి మంచిదికాదందును. వానిమంచితనము, నె
మ్మది, శాంతి, వీనికన్నిఁటికిని సెలవులుయిప్పించి, పిచ్చియెక్కించె
దను. మూరునన్ను మెచ్చుకొనును, ౹పేమించును. బహుమతుల
నిచ్చును—నాయీఘనకార్యమునకు బొటయిది. కానియింకను,

అడుగులుపడఁజాలవు; కనఁబడవు. అంతయును దల క్రిందులు పంచాంగముకదా. సవ్యమునకుఁ దలయుఁదోఁకయు సరిదాకు ను. ఇదియపసవ్యము. అఱచేతఁ బల్లు మొలువవలయును. వా డినఁగాని రంగులుబయటపడవు. ఆడినఁగాని నెమిలికన్నులు బయటఁబడవు.

అయాగో తనయాట ప్రారంభము. సిద్ధివినాయకపూజ యయినది. మూఁడవకన్నుఁ దెఱచినాఁడు. చుఱుకుపాలుతో బనియగుచున్నది. తోడుపాలు తనకవసరములేదు. సేనాని యగు కేశియోాయెడలఁ దనకుఁగలస్వామిపరత్వము, ప్రేమ, వి శ్వాసము, యివిపైకికనఁబడు మేలిముసుగు. మేలిమిసరుకు. బుద్ధిపూర్తి విప్పమనినాఁడు. ఒక్కచుక్కయయిన నందులనిలు వ యుంచవలదనినాఁడు. ఇప్పుడుతనమీఁదఁ బెట్టఁబడిన, సీకా ఫుదారీపనికిని,బుద్ధికినిచాలదవ్వు, సహవాసముగిట్టదనియు కేశి యోకును దెలియును. విప్పగిప్పననినాఁడు. అయాగో స్వతం త్రపుమనిషిలాగునను, యింటిమనిషిలాగునను, పరాయివాఁడు కానివడువునను,నొడుపుగ నొడుపువలె, నిజమునిష్ఠురమనునట్లు తనమాటరుచించుట లేదనియు,తనమాటకు గణ్యతలేదనియుఁ, దానినిన మాన్యత లేదనియునిన్ని విధములను,అయాగో తనమొ గమునకుఁ దానుకళాయివేసికొనినాఁడు. పూఁత తనదియే. ఈ విద్య యింకొకరికింతవట్టు రాదు. కేశినిషూదనుఁ డయినాఁడు

కేశియోను బడఁగొట్టినాఁడు. తీర్థమనినాఁడు. చిన్ని చిన్ని గాజు కాయలలోనింపి,అయాగో యేయందించువాఁడు, పెదవివఱకును. పాటలను ప్రేలువాఁడు ; ప్రేలించువాఁడు. కేశియోనోరు ధో రణిలోఁ బడినది. ప్రజలలోఁబడినది. ఈరీతిగ నలుగురినోటి లోఁ బడినాఁడు. దొరసానిడెస్డిమోనాను మెచ్చుకొనుటయే, పొగడుటయే,కొనియాడుటయే,కనియాడుటయే. మాటమా టకుమధ్య త్రాగుడుయే. త్రాగుడు త్రాగుడుకు మధ్యవాగుడు యే. తనయమ్మగారు డెస్డిమోనా యందము చెప్పగిప్పరాదను ను. బుడ్డియెక్కినకొలఁదియును,మతిస్వాధీనముతప్పినది. తప్ప గనే యెక్కడలేని చిరాకు పరాకు. చేతికిపరపర ; కఱుకుఁ దనము,పరుసఁదనము;దురదయెత్తినది. దానితోడ దురుసుఁద నము. మనిషికనుబడిన నేమికుక్కజట్టీలు తెచ్చునో యను భ యస్థితికి దిగినాఁడు. ఈపరిపక్వము, యీసరిపక్వముకని పెట్టి, అయాగో, రోడరిగో (Roderigo) యనుమెతకవాని నుసికొ ల్పినాఁడు. ఇద్దఱునుగత్తులునూరినారు;దూసినారు. మధ్యవర్తు లు, పెద్దమనుష్యులు, తగుదుమనుకొనువారాయిద్దఱిసందునఁ బాయఁదీసినారు. అఖండపాయ,విడఁదీసినారు. కాని,మధ్యనిలఁ బడువారికి,మధ్యయిటునటుగూడ,దెబ్బలే,పిడుగుద్దులసహవాస ములే. మాంటెనో (Montano) యనుపెద్దమనిషి యుద్యోగ స్థుఁడు,మధ్యస్థమున నున్నందులకు గాయముపడినాఁడు. దొమ్మి

సామాన్యమునకు దిగినది. సురయమ్మగారు,అమ్మవారందఱిని పూనినది. శివమెత్తుకొని వచ్చినది. చినుకుచినుకు,గాలివానకు ముదిరినది. దీనికంతకును నారుపోసినవాఁడు,అయాగో. వంగ నారు. ఇతరులను వంగునట్లుగావించు నారు. ఇతరులను వంగ మనునారు. ఇతరులనడ్డి విఱుఁగఁగొట్టు నారు. ఇతరులఁదలలఁ దలల ఢీకొల్పి ఢిక్కీలనుగొట్టించు,భళ్లుభళ్లునఁదలలను బగులఁగొట్టించు నారు. సైప్రసు జనులకు భీతావహముపుట్టించినవాఁడు కూడ నీ అయాగో. బెదురుగంట గనగన మ్రోఁగించినాఁడు. ప్రళయము ముంచుకొనివచ్చుటను దెలుపుచున్నట్లువిని ఒథెల్లో యులికిపడి చివాలున లేచినాఁడు. తొట్రుపాటు పడినాఁడు. దుస్తులేమిధరించినాఁడో,దొమ్మిచోటుకు విచ్చేసినాఁడు. కాపఁ కేశియోను సమాధానము కోరినాఁడు. కేశియో యిప్పటికి మామూలు కేశియో,యెప్పటి కేశియో యయినాఁడు. మద్య మునిషా తగ్గుదలకు దిగినది. జవాబిచ్చుటకు సిగ్గుపడినాఁడు. భిడియపడినాఁడు. లజ్జించినాఁడు. మనదేశపుశోభనపుఁ బెండ్లి కూఁతురైనను గొంతవాసి. మాట యూడిపడదు. మిన్నకుం డినాఁడు. అయాగోగారుండనే యున్నారు, మధ్య. పెట్టనిపీట, వేయనివిస్తరి, కేశియోను బల్లెత్తు,పల్లొత్తుమాటయనుట కిష్ట ముకానట్టు నటన,పయికిఁ బ్రకటన. ఒథెల్లోబలవంతమువల్ల జవాబూడిపడినట్టు.ఒథెలోకునిజస్థితి తెలియవలయునట్టుగంపంత

యున్నట్టు, యావద్వృత్తాంతము సాంతముగఁ జెప్పెను. తన మేడిపాలు విడిచినాఁడు. మేడిపండుచూడ మేలిమి. ఉప్పుకప్పురము నొక్కపోలిక. కడుపువిచ్చిచూచు తరుణము ముందున్నది. రుచులుచూడఁ జూడఁ జాడవేఱు కనువేళ యింకను రానున్నది. ముసుళ్ళపండుగ ముందున్నది.

ఇఁక, కేశియో మొగము చూడవలసియున్నది. అతఁడు మతివిఱుపు,మఱపులనుదాఁటి,మతిఁదెలియు పరిస్థితికింకను రాలేదు. అందువలన,అయాగో పెట్టినదియే,భిక్ష యయినది. వేసినదియే తులసిదళమయినది. కేశియోగావించినతప్పు, అయాగో,యిసిరింతలుగావించినట్లు పైకిఁగనఁబడుచున్నను, వినినవారికిఁ గసిరింతలుగఁ జేసినది. ఒథెల్లోతేల్చిన పర్యవసానమిది. అదుపాజ్ఞలకందఱును దలయొగ్గియే యుండవలయును. అందులోముఖ్యముగ నాయకులగువారు,మఱింత యెక్కువజాగరూకతతో మెలఁగవలయును. లేనియెడల సన్నకారులోఁ గట్టడియుండదు. కాఁబట్టి కేశియో యుద్యోగమునకు క్షౌరము. తిరుపతిక్షౌరము కాదు. నునుపుక్షౌరము. ఒథెల్లో వేఱువిధి లేక చేసినాఁడు. నంబియందఱకును నెదురుపడవలసినదియే. తనకుమాత్రమాయుష్యము. తనకానందము, తనసంతోషము, తనస్వర్గము. అందఱికొంపలను గూల్చవలసినదియే. అదియే తనకారోగ్యము. తిరిగి కేశియోయొద్దకుఁ బ్రత్యక్షము. ఏమి

దేవరా ! గాయముతగిలినదా? అని,అయాగోగారు. "వైద్యు నకు లొంగునట్టులేదు." అని కేశియో అయ్యోపాపమే యని అయాగోగారు. "గాయముల కేమి,పేరు,పేరు,పేరు,పేరుమాటఁ జెప్పు. నాపేరుపోయినది. శాశ్వతమగుమంచిపేరు మాసిపోయి నది. ఇఁకఁబశువును మిగిలినాను. ద్విపాదపశువును మిగిలి నాను. నాపేరు అయాగో ! నాపేరు." అని కేశియో. నా కుఁబట్టుకొనిన విచారము నీకుగాయముతగిలినదని. అదిలేక, పేరుపేరని కొట్టుకొందువు. కాసులపేరా ? వరహాలపేరా ? మొహిరీలపేరా? ఏమి ? ఇందులోఁ దెలివితేటలులేవు. పేరువం టిభేషజము,తంత్రముమఱియొకటిలేదు.తలమాసినవారికిఁదలనిం డ తొడుగులు దిగవేయుదురు, పేరువచ్చినదందురు, పేరుపట్టిన దందురు. తిరిగియాతొడుగులన్నియును నష్టేటఁ గలియును.ఈఁ కెలుతీసినకోడిపెట్ట యగును,మిగులును; పేరుపోయినదందురు. నీకీసరకువద్దు. నీపేరేమియునుబోలేదు. పోయినదనుకొనినఁ బోయినట్టే. ఓపిచ్చివాఁడా ! నేఁజెప్పువేదాంతమును వంటఁబ ట్టించుకొనుము. అంతకును మనస్సుప్రధానము. సేనానాయ కుల యనుగ్రహము తిరిగిసంపాదించుకొనుటకుమార్గములున్న వి. నీవుచేసినలేఁతపనికిఁ గార్పణ్యముచేతఁగాదు; ఆగ్రహముచే తఁగాదు. నలుగురు గజగజలాడునట్లు,భయభక్తులతోఁ బ్రవ ర్తించుకొనుటకును గొద్దిపాటిరశ్ర వేసినాడు. వెళ్ళవయ్యా,

యనయొద్దకు,ఆయన మీావాడేను." అనిఅయాగో వెళ్లుటకు మొగముచెల్లదనును. ఓథెల్లోనన్నుఁ ద్రాగుబోతనును. అ ని కేశియో నీవేమి,యెవరేమి? యేదేనియొకసారి త్రాగిననేమి మునిఁగినది? ఆమాటవిడిచిపెట్టుము. ఇప్పుడు నీవుచేయవల యు పద్ధతి చెప్పుచున్నాను. మనసేనానాయకుని భార్యగారిదే యాజమాన్యము; ప్రాజాపత్యము. పెత్తనము. మనసేనా నాయకులుచేయు పనియంతయు నిప్పుడమ్మగారిముఖావలోక నము,యామెనే వెట్టిచూపు; తదేవదృష్టి. ఆమెవన్నెలుచిన్నె లు తలపెట్టుటయే. అందముగిందము చెప్పుటయు గిప్పుటయే. నీవామెయొద్దకుఁబోయిచేసినతప్పిదమును ధారాళముగ నొప్పు కొనుము. ఎప్పటిమెట్టునకెక్కింపవలయునని ప్రార్థేయపడుము. ఆమె యెటువంటిమనిషి యనుకొంటివి. నవ్యనవనీత మానసు రాలు.చెప్పుకొనినవిన్నపము చక్కఁగనాలకించును. ఆలనయుఁ బాలనయుఁ గూడకలదు; దయాళువు; సమర్థురాలు, తగిన సమయముకనిపెట్టి మగనితోమాట్లాడును. ఉపకారి; పరోప కారి; జనోపకారి; మహోపకారి. కోరినదానికంటె నెక్కు డుపని చేయును, అట్లుగావించకపోయిన, దోషమనుకొనును. దోసకారి యనుకొనును. మీాయిరువురిసందున నున్న యీవిరి గినకీలును తిరిగియంటఁగట్టుమని ప్రార్థింపుము. అప్పుడుసీయదృ ష్టమే యదృష్టము.నీదే యదృష్టము. నీవే యదృష్టవంతుఁడవు.

నీమీఁదదయ వెనుకటికంటె మఱింతబలపడును. ఱొట్టెవి
ఱిఁగినేతిలోఁబడినట్లే. అయాగోచెప్పినవి కేశియోవినిమనసునఁ
బట్టించుకొనినాఁడు.ఉద్యోగముదక్కినట్లే యనుకున్నాఁడు. కలి
పికొట్టరాకస్తురిరంగయనుకొనినాఁడు.పెద్దమనిషియనిన,అయా
గోగారే యనుకొనినాఁడు. అనుకొనుటయేమి? నిజాయతీ, అ
యాగో,సత్యమూర్తిఅయాగో,శలవు,శలవు గైకొనుచున్నాఁడ
ను,అనినాఁడు. అయాగోగారొంటఱిగ మిగిలినారు. తలఁపులు
పక్వమునకు వచ్చుచున్నవి. సంతోషమునఁదాండవము. తాం
డవకృష్ణుఁడగుచున్నారు. నేనుచెడ్డవాఁడనని చెప్పునిర్భాగ్యుఁడె
వఁడు? నేనెటువంటిహితము,హితవులనెఱపుచున్నాను! సద్వృ
త్తితోను,సచ్చింతతోను,యిచ్చినట్లే కనుబడును. మూరుమతిఁ
ద్రిప్పునట్లే. కాని,యిదిమాత్రము నిజము. ఏది? డెస్డెమోనా
యొద్దకుఁజేరి అమ్మా! మీవలన నీకార్యము కడతేరవలెను,
అనినఁ జాలును. పంచభూతములవలె నంతటిధారాళహృదయ;
సదయహృదయ,కేవలము భూదేవియే. మూరును వంచుట
యో,తనవశము చేసికొనుటయో,యత్నముసాఁగించును. మూ
రుకు డెస్డెమోనా లోడిద లోకము. ఆమెపెట్టినదిగిఁ; పట్టినది
పస; పెట్టినది భిక్ష; మెట్టినది భమిడి. ఆమెనిలువుమనిన నిలు
చును. ఏదిచేయుమనిన నదిచేయును. ఆమెమీఁదఁ బ్రేమాపా
శము పెనవేసికొనినాఁడు. ఇఁక నాచెడ్డతనమది యెక్కడను

న్నది ?—కేశి యొుకు, యీ మాత్రోనచూపించుటలో. తనమంచి కే, నేఁజెప్పితినే ? దయ్యమే దైవము కాఁగూడదా ? దయ్యములు పంచమహాపాతకముల నెత్తిమీఁదఁబెట్టుకొనినప్పుడు, పైకి నె క్కుడలేని దైవభక్తి, దైవనియుక్తి, దైవసాహాయ్యము, సత్యంవద, ధర్మంచర—ఇప్పుడు నేనుమాత్రము నీతిశ్లాఘ్యపథమును శిరసావ ట్టునట్లే కనఁబడుదునుగదా! పైదంతయు సిమ్మకాయవాటము. అలచేత వైకుంఠము. మీసములకు సంపెంగనూనె. మ్రింగ మెతుకుూడిపడునో లేదో. జరుగఁబోవు జ్యోతిషమిది. ఈచ వట మొగము, పనికిమాలినవాఁడు కేశియొూ, డెస్డెమోనా చెం తకుఁజేరి తనసోదిచెప్పుకొనును. నోటికి మూఁతయుండదు.తన ను గట్టెక్కించుమనును ; ధన్యాత్ముఁడుగఁజేయుమనును. పాప మూ వెట్టిబాగులది మూరును, సాయబయ్యను, బడేమియ్యను విడువదు. పట్టిపల్లార్చును. కేశియొూవిషయము మూరిపోయును. ఈసమయమున నేనందుకొని మూరుచెవిలో నూఁదుదును. కా రణముండకపోదందును. ఆమెమూరును నొత్తిడిచేసినకొలఁది యును, కేశియొూకు,ఉపకారముచేయుతలంపు మిక్కుటమయిన కొలఁదియును,అంతకునంత మూరుకు భార్యమీఁదనుండు విశ్వా సము నూఁడఁగొట్టెదను—ఆమెమంచినంతయును, యలమంచి చేయుదును. యలమంచిక్రింద దింపుదును. ఆమెమంచితనము నకే యుట్టికట్టి,చుట్టఁబెట్టి,కట్టఁబెట్టి, యనంతశయనముగఁజేసి,

వల్లకాటికంపించెదను. ఈయురిలోఁదగులుకొనువా రెందఱో మహానుభావులుందురు.

అయాగో పన్నాగము పసకెక్కినది. పూర్తియైనది. మొదటియంతస్థు. సవతిపోరు కడముట్టినది. ఉద్యోగము నేలమట్టమయినది. ఈయమర్యాతిచర్యలు తరువాతిపాకమునకుఁబోగపు దినుసులవలె నుపయోగింపవలసియున్నవి. కేశియోామనసు, యీవిపత్తువలనఁ గుదిమట్టమునకుఁ దిగినది. అయాగో తన కాంతర్యస్నేహితుఁడనుకొనినాఁడు ; గరిష్ఠుఁడు,వరిష్టుఁడు. తన యుద్యోగము పునరుద్ధారణమునకుఁ దెచ్చిపెట్టుటకు వశిష్ఠుగ నేర్పరించుకొనినాఁడు. తప్పఁద్రాగి తానొకమృగమయినందులకు,పశువయినందులకు,నరపశువయినందులకు నేడ్చినాఁడు. అధోగతికివచ్చినాఁడు. తిరిగితనకొలువు తనదొర నడుగుటకెటులు మొగముచెల్లును? సగముచచ్చి, యెదుటఁబడి యడిగిన త్రాగుబోతనితిట్టును. అందువలన నాత్మనిరసనము. కేశియో గుండెకుఁ దట్టుకొనినది. అయాగో సర్దును. సమయాసమయములులేవా? పిచ్చిపట్టి త్రాగుదురా? ప్రమేయములేనిది. బొందిలోఁ బ్రాణమున్నప్రతివాఁడును జేయుపనులేయివి. ఇప్పుడుమాత్రముమించినదేమి యున్నది? పోయినయుద్యోగము తిరిగిసంపాదించుకొనుట నిమిషము. సేనాధిపతిభార్యదియే యాధిపత్యము ; పెత్తనము. ఆయనయో ప్రక్కనపేనుపాటి.

వేసినచోటనే యుండుగొంగళి. దొరసానిబొడ్డుకొంగున మగ నిఁగట్టుకున్నది—వలెవాటుకొంగునఁ జెక్కుకున్నది. ఆమెచెప్పి నట్లెల్ల నాడును. కావున నామెకువిన్నవించుకున్న పక్షమున, వెనుకటియు త్తరువును దిరుగఁదోడించును. ఆమె బహుయుప కారబుద్ధి గలది; ఉపకారజీవి. నోటిసాయమే గదా, వరహా లా? మాడలా? యిచ్చుటకు. మాటలాడిన నోటనుండిముత్య ములేమైన రాలునా? అనుకొనుమనిషి. కల్లకపటమెఱుఁగదు. దొరకెప్పటి యనుగ్రహముపుట్టునట్లు గావించును. ఈసారి వెనుకటికంటె బలీయమగును. బ్రదుకుఁదెరువు చూపనెఱిపిన, హితము,హితవు,ఉపరితలమునకు.ఎట్లుపరిణమింపఁబోవునదియు పుణ్యమెటులఁబుచ్చునదియు, పాపమెటులఁబండునదియుఁ దెలి యఁగలదు.

కేశిరెడ్డిపు, తెల్లగఁ గనఁబడునవి యన్నియుఁబాలే. అ యోగో,హితమనిచెప్పినాఁడే,అదేరీతిగఁ, జీమతలకాయ యంత నైన మేరమీఱక పనిఁబూనినాఁడు. డెస్సెమోనా దొరసాని తోఁ జెప్పుకొనినాఁడు—మనవిపూర్వకముగ.ఉపకారమే కదా, ఊపిరికట్టు కాదుగదా. తనచేత నైనంతయు శక్తివంచనములే క ప్రభువువారితోఁ దనపక్షముమాట్లాడుదుననెను. వాదిని యగుదుననినది. న్యాయవాదిని యగుదుననినది. చచ్చినను సరే తనపట్టును విడువననినది; చలపట్టిసాధింతుననినది.

"సరసము విరసముకొఱకే
పరిపూర్ణసుఖంబులధిక బాధల కొఱకే"

వానికనుపుకందవిత్తుగ నేమహానుభావుఁడు ఘంటముతోడ నేవే శయప్పుడు వ్రాటియాకుమీఁదఁజెక్కినవాఁడో, రామబాణము పురుగులీయక్షరములఁ దాఁకలేదు. ఏపురుషుఁడేదంపతులకుఁ బొడమినను, యేదేశవాఁడైనను, యీసూత్రకట్టుకు బిగిసియే తీర వలయును. మీసమకట్టియా? కత్తియాడించినట్లెల్ల, చెయి యాడించినట్లెల్ల, మనసుయాడించినట్లెల్ల, సినీమాబొమ్మలాడించి నట్లెల్ల, మారుటకు, మార్చుటకు, మాడ్చుటకు, తెలుపెక్కించిన కొలఁదియును, నలుపెక్కించుటకు, నలువెక్కించుటకు.

నేర్పరియగుబ్రహ్మ తగులంగట్టిన యీనూత్నదంపతులు తమతమ యిష్టములబ్బుతరి నానందాబ్ధినోలలాడిరి. పంతము గెల్చుకొంటిమనుకొనిరి. ఇరువురకు నరమరలుండఁబోవనుకొ నిరి. విడిమరలు, విఱుపుడుమరలు పుట్టి, పల్లార్చునని యెఱుఁగరు. అయాగో యాడించు తోలుబొమ్మలయాట, జంత్రపుంబ్రతిమనా ట్యమారంభమిదివఱకే యయినది. ప్రక్రియలుతయారగుచు న్నవి. కేశియోయనిన, ఒథెల్లోకుఁ దగనికోపము వచ్చినది. కొ లువునీతి తప్పినాఁడు. తెలిసియు, జేస్టమోనా, తప్పకొనిన బా గుండెడిది. కేశియోయుద్యోగ పునరుద్ధారణవిషయము మగ నితో, నాదుర్దాగ మాట్లాడినది. ముద్దుముద్దుగ ముచ్చటించినది.

మగఁడు ప్రస్తుతమాఁగమన్నాఁడు. అంతటి నేరస్థుని, అట్టియ పరాధిని, క్షమించుటకిప్పుడు తరుణము కాదనియు, ననినను నాఁగదే, వెనుకకుఁ దగ్గదే, మళ్ళదే. రేపటి రాత్రి తప్పక చేయవలయు ననియును, లేదా, ఆమఱునటి యుదయము, యింకనువీలు కాదా, ఆమఱునటియుదయము తప్పదు—తప్పనిసరియ నెను. అంతటితో నైననూరకుండదుగదా. ఊరకుండినఁ బ్రదుకు బంగారమువంటిదిగ నుండెడిది. నోటిజట్టీలు బలపడుచున్నవి. కేశియో పశ్చాత్తాపముపడుచున్నాఁడనియు, పాపము వాఁడు బహుకుంగిపోయి నాఁడనియు, నాతని నేరమింతటికి తినశిక్షకుఁ దగదనియు, చెప్ప నారంభించినది. తానేమో గోగునార యనుకున్నది. ఒక్కో యేమో, భీష్మములోఁ బడుచున్నాఁడు. అఱవందపుడెస్సైమో నా గోగునారవలె తెగసాఁగుటయే కాని గ్రహింపులేదు. హే నాథా, కేశియో కొఱకు, మై కేలు కేశియోఁ కొఱకు, మన కేశియో కొఱకు, మనపాణిగ్రహణము కొఱకుఁ దనయాావచ్ఛక్తిని ధార నోసి, మీపక్షము వహించి, శిరసావహించి, నన్నుఁ దమయనుకూలపుమానిసిగ, పరణము, నవతరణము, నాభవతరణమును గావించి నట్టి, మనవానివిషయమయి నేనింతదూరము, నేను, మీకుఁ జెప్ప వలయునా? ఒక్కొక సమయమున, నేనుమిమ్ములను నిరసనము గావించినప్పుడు, తానేవిూరనుకొని వాదమునకుఁ బ్రతివాదము సల్పెడివాఁడు. అతఁడుగావించిన యింతటిమహాకార్యమునకు,

నేనిప్పుడుమిమ్ములనడుగునది నొకస్వల్పవిషయము చేయఁగని మిమ్ములనుగోరునది యొకస్వల్పకార్యము. మీకునామీఁద నెంతటిప్రేమకలదో తెలిసికొనఁదలఁచినప్పుడు,మిమ్ములను గొప్పవిషయముల నడిగెదను. కారాకూరములనెన్నిఁటినో, డెస్డెమోనా మగనిముందరఁ జేసినది. తనచాతుర్యమువలన మగని నోరు కట్టివేసినది. కాలము రావలెనన్నాఁడు. తనకుఁదెలియునన్నాఁడు. తనకు విడిచిపెట్టుమన్నాఁడు. తిరిగికొలువునకుఁ జేర్చుకొందునని వాగ్దానముకూడ చేసినాఁడు.

- అయాగో జారవిడిచిన యుచ్చులోఁ బడినారు. తాను దలఁచిన ముగ్గురును—ఒథెల్లో,డెస్డెమోనా, కేశియోలు,ఓథెల్లో కంఠమునకు నీలమెక్కుచున్నది. కేశియో,డెస్డెమోనాతో, నామెపాదములతోడుగఁ దోడుతఁ జెప్పుకొనుసరికి ; సరికాని సమయమున,ఒథెల్లో,-యాగోలు,ఆగదిలోనికే యడుగుపెట్టునట్టుజరుగవలెను.దానివలన నొకటంకము పడును,పొంకమునకు దిగును.అయాగో తలఁచినట్లు పన్నినట్లు టంకముపడనే పడినది; కుదురనే కుదిరినది; మాయధారిటంకము,పొంకము పసమీఱినున్నది. ఒథెల్లో,అయాగోలు,ఆగదిలోనికివచ్చుసరికి,డెస్డెమోనాతో ముచ్చటించుచున్న కేశియోవారిరువురనుఁజూచి,మొదుటిద్వారమునుంచిదూసికొని వెళ్ళిపోయినాఁడు. అయాగోకు, గజకర్ణగోకర్ణవిద్యలు హ్రాత్కపిలి. వారు సర్వవ్యాపకులు.

ముచ్చుట్టును వెన్నాడుచున్నారు- వెన్నముద్ద పైకిమాత్రము, చీనాపంచదార, నేతిబీరకాయ, చీనిచీనాంబరములు, పీతాంబరధారి. అంతర్యము విసపువిత్తు, బొజ్జంతము వెగటుజాడలు నిండియున్నవి.

ఒథెల్లోకు గుండెకాయ యయినారు; లింగకాయ యయినారు. చెఱవిడిపించిన లింగకాయ యయినారు. ఈగుండె కాయవలననే, తనకు లోలోననుండి గుండెదడ పుట్టుకొనివచ్చునని కలలోనయిన, ఒథెల్లో తలఁచలేడుగదా; తలఁచఁడుగదా. ఈలింగకాయ తనయంతర్లింగమును, యిహలోకపర్యటనమును చాలింపించి పంచమహాలింగములలోఁ గలగలుపునని, పనఁగలుపునని, నైక్యముగావించునని తలఁచఁడుగదా. అటు కేశియోను డెస్డెమోనా కాలిక్రింది కుక్కపిల్లవలెఁ గావించి, కేశియో ఆమె సమక్షమునుండిగిరుక్కుమనుతరుణమునకు, ఒథెల్లోతోడభాయి, భాయీగా వచ్చును. కేశియో తారినఘట్టముగాంచి, అయాగో గారు, స్వరముహీనము; సణుఁగుగొణుఁగు. తనలోఁ దానను కొనునట్లే. మాటబిగ్గరగ రానియ్యఁడు. బిగ్గరగ రానిచ్చినఁ గొంపలుమునుఁగనే మునుఁగవు. నెమ్మదియనిన వినఁబడనంత నెమ్మదియు నుండదు. ఎదుటివాఁడు కనిపెట్టవలయును. ఒథెల్లోకు వినఁబడవలయును. ఏదియో మాటజారిపడినట్లు కనఁబడవలయును. ఆఫక్కీని, కేశియో నుద్దేశించి 'అబ్బే, యేమియో

బాగా లేదు' అనిమాత్రమీ వలకూడిపడినది-ఒథెల్లో, అప్పటికీగొ
ణుఁగు, ఆ తలపంకింపులకు, ఒథెల్లో నేమియు నెక్కువగ ననుకొ
న లేదు, కానిఒథెల్లో చేత నడిగించుకొనినాఁడు. భార్య చెప్పిన
యుబుసు, దీనిని మఱపించినది. మనసులో మాత్రము మసలి
నది. తగినకారణము తెలిసినది. అయాగో యింతకుమును పు
పలికినపలుకును ఒథెల్లో వినఁ గోరినాఁడు. ఏమందురు? మహా
ప్రభూ! ఏమియును లేదు-ఒకవేళ యున్న. ఏమో దెలియదు.
మనలనుజూచి, మీభార్యనుండి, కేశియో, విడివడిన విషయమా?
కేశియోమాటయా? మహారాజా! నేనామాటయే తలంచనే
లేదు. ఏమియులుకు వచ్చిపడినది? నేఁజెప్పలేను. మీరాకఁ
జూచి చల్లఁగ జారినాఁడు.

విత్తనము పడినది. చవట నేలకాదు. చవిటినేలకాదు. గుల్లనేల కాదు; ఇసుక నేల కాదు; ఎరువుభూమి, ఎత్తుకునొత్తు ఫలింపునకువచ్చు సుక్షేత్రము. ధర్మక్షేత్రము. అవుగావులు, అవుగాములు, యిదమిత్థమని నిర్ధారణముచేసి, నిరూపింపఁగల, రూపింపఁగల, బింబింపఁ గలమానసము, ఒథెల్లోది కాదు. దున్నపోతీనినదని యొక్కఁడుచెప్పి, లేఁగడదూడ నొకదానిని దానిచక్కని జాట పెయ్యగనుంచిన, నెవడురా, అక్కడ 'కట్టివే యుము' అనునట్టివాఁడించుమించుగ. డెస్డెమోనా మగనియొద్ద నుండి వెళ్ళగనే, అయగో, తనమనస్సు తృప్తికి, సంతుష్టి కేదయో

నొకకుశ్శంక తనమనస్సులో నుండినట్లు,నివారణకొఱకుఁదాను
డెస్డెమోనాను వరించునప్పుడు, ఆమెను గామించియుండెనని
కేశియోకుఁ దెలియునా? అవును,అని,ఒథెలో చెప్పెను, తెలియక
యేమి? ఆయనిదే రాయబారము. మాయిద్దఱిసందునను,
రాకపోకలు,రాపిడియెక్కువగనే యుండెడిది. అనఁగనే,అయా
గోగారు కనుబొమలుగట్టిగ ముడివైచినారు. జారుముడికాదు.
సాదాముడి కాదు. గర్భనిర్భేదపు ముడి. కొంపలుకూల్చును
న్న ముడి. గొప్పఘోరమువిషయమయి క్రొత్తసంగతి తెలివికి
వచ్చినట్టుగ 'నిజంగా?'అని యఱచినాఁడు. దీనితో,ఒథెల్లో
మనస్సుకు,గదిప్రవేశము చేసినపుడు,అయాగో యేమోమాట
లుజారవిడిచినట్టు తట్టినది.డెస్డెమోనా చెంత కేశియో యుండు
టయు,నారంభమయినది, యాగాటము; మనసొకరాటమువలె
తిరుగుచున్నది. దీనియంతలోను నర్థముండకపోలేదనుకొన్నాఁ
డు. తనమతికి,అయాగో యొక యపరధర్మరాజు. తాననినఁబ్రే
మయు నాపేక్షయు నెఱనిండుగ నున్నవి. ఇతరులు వెధవలు,
టక్కుటమారులు. తన,అయాగో బహుపెద్దమనిషి. పెదవి
దాఁటి మాటవచ్చుపక్షమున,దానివలన నెవరికేమికీడు మూ
డునోయని యులుకునట్టి,ఝడియునట్టి పురుషరత్నము, నరసిం
హము,సాధకబాధకములు,అవుగాములు తాను మనసులో నా
లోచించి నిశ్చయమునేర్పరించుకొనినఁ గాని నోటినుండి ముత్యా

ములనుబయటకు రానియ్యఁడు ; రాలనియ్యఁడు-కొంపలుతగు లఁబడు మాట యేదియో యున్నట్లున్నది. బరువుతోఁ గుంగి పోవుచున్నాఁడు. ఒథెల్లో, అయాగోగారిని బ్రతిమాలినాఁడు. తెలిసినది చెప్పుటకేమి యాక్షేపణ? పండగాల్పయిననేమి? రామవాక్యమును బయటపెట్టుమన్నాఁడు. గడ్డముపట్టుకొని బ్రతిమాలినట్టే. నామీఁద నీకు నెఱనిండు యంతఃకరణము, దయ, ఆపేక్ష, ప్రేమ, వీనినన్నిఁటిని మించినసత్యసంధత ; నోటి నుండి బయటకువెడలు ప్రతిమాటయును, తూఁచిమఱి విడుతు వు. మాటలకు మాటలకు మధ్య, నీవునీళ్లునమలుట, వెచ్చనిూ ర్చుట, చూడఁజూడఁగ నాకు హడలుపుట్టుచున్నది ; హడలు పుట్టి చచ్చిపోవుచున్నాను. ఇటువంటివి, విశ్వాసములేని, విశ్వాస ఘాతకుఁడగు తులువకు, పలువకు, సాదుపలువకునిత్యనైమిత్తిక ములు, ఆహ్నికములు, సంధ్యవార్పులు. కాని, నీవంటిపుణ్యపురుషు నకు, సుశీలునకు, నిజపురుషునకుఁ దూనికరాళ్లు, పడిగట్టురాళ్లు, నిలుపుగీతలు. అంతర్యముననుండి నిలకడపని, నిలుకడపనిగావిం చును. రాగాదులకు దొంటకెడివాఁడవు నీవుగావు ; మహానుభా వుఁడవు ; ఎందఱెందరో మహానుభావులు పుట్టినారు; గిట్టినా రు; మీరే మీరు. మీకే మీరు సాటి. మిగతవారందఱును ఛాయాపురుషులు; కచ్చాసరుకు. అయాగోగారిదియంతయు విని నారు. ఒథెల్లోమతి, వింతమతిఁ గనినారు. లోపలపొంగు. ;

బయటకు నిశ్చల,అపరపరబ్రహ్మము. మాటలను రాల్చుచున్నారు. మాటలుకావు, ముత్యములకోవలు. మంచిముత్యముల కోవలు,జారవిడిచినవి. మైకేలు కేశియో పెద్దమనిషి, అని మనస్ఫూర్తిగఁ జెప్పఁగలను,అని అయాగోగారన్నారు. నేనును అక్లేతలంతునని, ఒథెల్లో. కాని యొకటియున్నది బాబూ! కాని మనుజుఁడు పైకిఁ గనఁబడురీతినే యుండవలయును గదా—లోపలనేమియునుండని వారు పైకిమాత్రము కావలసినంతకంపు కొట్టుచుందురు,నోటిటంకులు, మాటయొట్టములు కుక్కజట్టీలు మనమువిననివి కావుగదా. ఎటువంటి,యెటువంటి మహామహా సౌధాంతఃపురములులోనికేగినాఁడు ; దుర్వాసనలు కొట్టునే-కొట్టనిపట్టు లేదే. అదేరీతిగఁ దనహృదయమునఁ గూడ పాప పుటూహాలు జొరఁబడినవియేమో,యనుభయము తప్ప తనకులేదు మాటలు తమాయింపుమీఁద,నదమాయింపుమీఁదదిగును.

ఏమిటికియీవృథా ప్రసవవేదన. ఉన్నకుళ్లుబయటఁ బెట్టు. పాపిష్ఠిమాటలయిననేమి? అని,ఒథెల్లోకాఁడు కల్లోలరాయఁడు. అయాగో-పాపిష్ఠిమాటలకొడిగట్టుకొనలేనను. తన చావునకిది వచ్చినదనును. తనయనుమానము దుర్మార్గపుదియేమో యనును. అదియేమికర్మమోగాని, యెక్కడ యే దుర్నడత యున్నను, దుర్మార్గతయున్నను తనకే కనుబడును. లేని యల్లికలనెక్కడయల్లితినో యనుభయము, జంకుయెక్కువగ

నున్నది. మీవంటివారు దొడ్డవారు, పెద్దమనుష్యులు. అనవస రముగ మీకు శ్రమనిచ్చుచుంటినేమో. మీమనసునకు నా యాసముకలిగింతునేమో. నాయూహలు మీరు తెలియఁజూ చుట, మీమనసునెమ్మదికి భంగము, మీమంచికిఁగూడ కాదు; కారాదు, కాఁగూడదు, తెలియఁగూడదు. మానుషము మీది; నిజాయితీ మీది, తెలివితేటలు మీవి. అట్టిమీకవసరము లేదు. వినివిని, ఒథెల్లో మనోకల్లోలరాయఁడయినాఁడు; అలలకల్లోల రాయఁడయినాఁడు. నీభావమేమి మహానుభావా? అనినాఁడు అయాగో నల్లికెళ్ళపాము. నడకసూటి, జవాబుసూటి గిట్టనిపా రుగు—చల్లనిప్రభువువారితో మనవిచేసుకొనుచున్నాను. మగ వాఁడైన నేమి? ఆఁడుది యైన నేమి? మంచిపేరు, అమూల్య మగు నలంకారము. మంగళప్రదమగు నలంకారము. నాధన మును దొంగిలినవాఁడు చెత్తను దొంగిలును, తుక్కును దొంగి లును. ఏదైననేమి? పనికిమాలినది, దిక్కుమాలినది. కాస్త, అనుకుంటే, కాస్త. వద్దు అనుకుంటేవద్దు. లేదంటే లేనేలేదు. వరహాలు, మాడలున్నవే? నిన్నటివఱకు నావి. ఈదినముమఱి యొకరివి. వేలకొలఁదిజనులను సుంకరులను గావించుచున్నవి. కాని, నామంచిపేరును, గొండంతమంచిపేరును గూల్చువాఁడు, రాల్చువాఁడు, తనకేమియును లాభముండదు, ప్రయోజనముండ దు, ఉపయోగించదు, తనకేమియు నొఱుఁగదు. కాని, నన్ను

మాత్రము పలుచనఁ గావించును,చులకనఁ గావించును.తలకొట్టి నట్టు చేయించును. మీకోరికకు నేను సంతసిల్లితిని. నానిర్మల హృదయము,శుద్ధస్ఫటికాకృతి యిప్పుడుగదా దేవరవారికి విశదము కాఁగలదు. నేనుశుద్ధబ్రహ్మ పరాత్పరరాముఁడనని తెలిసికొనఁగలరు. తమయడల నాకంతటి నిండుదయ, నిండారిన ప్రేమ, కడుపాతిన యాపేక్ష, యజమానునకు సేవకుఁడు చూపవలయు విశ్వాసము, పనిపస, కొలువును మేలుకొలువుగ, మేలుకొవుగ నిర్వహించుచున్నదియు సమస్తమును దమకుఁ గరతలామలకముగదా. నేను చూపునది యఱచేతివైకుంఠము కాదు. నిమ్మకాయవాటము కాదు. దబ్బకాయవాటము. నిలుకడ కలిగించు వాటము. తనయసంపూర్తి గ్రహింపువల్ల తనదొరసానిగారి కిబ్బందియగునేమో యనుభయమే. ఈతలంపులను దొరసాని వినిన శాంతిదక్కదు. ప్రజలమంచిపేరులు లేనిపోని యనుమానములవలనఁ దీసివేయరాదు. మాపు చేయరాదు. విని ఒథెల్లో జోరీగలగొడ్డు కాఁబోవనున్నాఁడు.

ఇప్పుడింకను నిదర్శనములవంకకు రాఁడు, అయాగోగారు. ఇంకొకప్రదర్శనము కావలసియున్నది. చిత్రవస్తుప్రదర్శనము కావలసియున్నది. మీభార్యను గనిపెట్టియుండుఁడు. కేశియో చెంతఁబట్టియున్నప్పుడు వాలకమును గమనింపుఁడు. ఊరక కనులుపెట్టుకొని చూడుఁడు. పరమపతివ్రత యనుకొన

వలదు. వీరపత్నివ్రత యనుకొనవలదు. లేనిపోని పుట్టెడు యను మానము పుత్రియందుఁ గూడనుంచవలదు. మీరు బహు మంచివారలు. దొడ్డబుద్ధి గలవారలు. మీమనస్సును గలంచుటకు నాకు మనస్కరించదు. ఆలోచింపుడు. మాదేశము వారిసంగతి మాకుఁ దెలియును. వడియఁ గాచినారము. క షాయము దించినాము. నెఱజాణలు చేయునవి, చేయఁదలచి నవి చేయకమానరు. కాని యంతయును మటురహస్యము. బ్రహ్మకును నభేద్యము. చిదంబర రహస్యమునకు మూరు, ఉ దుంబర రహస్యము. పైకి మేలిమి. పొట్టను విచ్చి చూడ, నే మున్న నుండును. ఏమి చెప్పుదును? అయినప్పటికిని, స్త్రీపురు షాదులయందుఁ బుణ్యపురుషు లుండకపోరు. లేనియెడలఁ బ్రపంచమేలసాఁగును? వినివిని ఒథెల్లోకుఁ జెవులు చిల్లులు పడి నవి; తూట్లు పడినవి; ఒకజల్లెడ యయినవి. అలాగా? అను ను. ఓవెఱ్ఱివాఁడా! నిన్నువరించి పెండ్లియాడినప్పుడు తండ్రికిఁ గుచ్చుటోపి పెట్టలేదా? నామము పెట్టలేదా? పంగనామము పెట్టలేదా? అంతమాత్రము గ్రహింపు మీకు లేకపోయెనే? మీగడ్డము, మీచూపులను జూచి భయముపడు చుడిసికొనుకాలము కూడ కలదు. ఆకాలమునఁ దండ్రి ప్రాణ ప్రదుఁడు.

అవుఁజుమీ యనినాఁడు ఒథెల్లో; మనసునకుమాత్రము

సుమాళింపు లేదు. అయాగోగారు ఎందుకులెండి ? మా టలు. లేతవయసఁట. వయసు క్రొత్తఁట. తలపోఁతలెంతటివి యో తండ్రికనులకడ్డుగ నొక మట్టితనాబీ మాటుగ వైచినది. పాపమాముదుకఁడు మంత్రతంత్రము లనుకున్నాఁడు. నన్నెంత తిట్టుకొనినను బాపము లేదు. నన్ను క్షమింపవలెను; అపరాధిని. మీమీఁద మితిలేని ప్రేమగలిగియుండుటయే నాయపరాధము. ఒథెల్లో నిర్వహణమున కెప్పటికిని నీయెడ బద్ధానురాగుఁడనై యుందును. అయాగోగారు— అయ్యో, మీయుత్సాహమున కుఁ గంపనము కలిగినట్లున్నది. అబ్బే, యేమియును లేదు; గో రంతయును లేదు. అని ఒథెల్లో, అయాగో, అప్పటి కప్పుడే ఒథెల్లోయొక్క ప్రేగుల నన్నిఁటిని లెక్కించినాఁడు. ప్రేగు మీఁది ప్రేగు నెక్కించినాఁడు. ఎక్కుముగ వల్లె వేసినాఁడు. పైకిమాత్రము మీమనసు కలకబాఱినది. నాకదియే భయ ము. మీయెడ నాకుఁ గలప్రేమపొంగుయొక్క వార్పు యీ మాటలని తలంపుఁడు. మనసు కలఁచికొనినారు. అఘాయిత్య ములనుమాత్రము చేయవలదు. అనుమానము వలయకును మాత్రము దాఁటిపోకండి. దాఁటిపోనన్నాఁడు గాని, మనసున నొకగుదిగట్టు కట్టుపడినది. ఏకాంతముగ నుండవలయును. అ యాగోగారి వాక్యములకుఁ దాను వాక్యార్థములు గావించుకొ నవలయును. శలవు, శలవనినాఁడు. క్రొత్తవేయుయిన వెలయు

పక్షమున, నాకుఁ దెలుపుము. నీభార్యనుగూడ కాపలా యుంచు
ము; అయాగో! నన్నిఁక ప్రస్తుతము విడుపుము.

అయాగోగారు, ఇక్కడ వేసినయొకసూచన, అక్కడ
విసిరివేసిన యొక్కమాట, అన్నియు నన్నిములుకుట్లు. ఒథెల్లో
ను వింతమనిషినిఁ జేసినవి. డెస్డెమోనా స్వంతమనిషి వింతమ
నిషిక్రింద మాఱుచున్నాఁడు. అయాగో మనసున నున్నదానిని
కక్కించవలయునని ఒథెల్లో. అయాగోగారు కక్కువారా?
పైత్యాంతకరసము సంచికట్టు దగ్గఱ యుండనేయున్నది. ఇతరు
రులను నెత్తురుకక్కించువారు వారు. వారికివారే ప్రతిసాటి.
ఒథెల్లోమనసునకు నిన్నిపాట్లను దెచ్చిపెట్టి పచ్చివెలగకాయ
గుజ్జు నోటఁబెట్టుకొనిన రీతినిఁజేసినను, పైకిమాత్రము, ఒథెల్లో
కు మనశ్శాంతికి తాపత్రయముపడునట్లు, 'అనుమానమువంటి
దయ్యము మఱియొకటిలేదు మీామనస్సును దాని కాస్పద మి
య్యకండి' అనినాఁడు. తస్మాత్ జాగ్రత, జాగ్రత, అనినాఁడు.
ఎంతటివిద్దెయో, ఎంతటి చాకచక్యమో, పాపమాయామాయ
కపు స్మత్తికాలపు ఒథెల్లోకు హుషారు, హుషారు, అని యిస్తి
హారిచ్చి, జోహారువుపాడి, పల్లవిపాడి, అదేగోతిలోనికే అయా
గోగారు ఒథెల్లోను నెట్టుచున్నారు. కన్నముపొఱుటకు కాల
ము కుదురవలెను. కర్మము ముదురుపాకమునకు రావలెను;
పరిపాకమునకు రావలెను; పరిపాకమునకు రావలెను. పాద

రసమా, యుడుకుకొలఁదియు నెగఁబ్రాఁకుటకు ? "నాభార్య రూపవతి. జనమనినఁ బ్రీతి యెప్పుడును, పండుగ పబ్బము ప చ్చతోరణము. మాటలు గవ్వలవలె రాలవలసినదియే. లక్ష ణముగఁ బాడును ; శ్రావ్యముగ వాయించును; ఆఁట చక్కఁ దనమే. మానము గలయెడ నివియు మాననీయములే. తగుని దర్శనము లేనిది యీామె నన్యథా నేఁ దలంచను. నాకు నిదర్శన ము కావలెను. అయాగోగారు దీనికెదురెత్తు వేయుచున్నారు. తనకుఁగలిగినసంతోషమును బగ్గమువేసి పట్టినట్లు,తానును,తన యమ్మగారివిషయమున వేఱుతలఁచుటకుమనస్కరించదనియు, నిదర్శనము లేదనియు, కాని కేశియో,ఆమెదగ్గఱనుండు నప్పుడా మెవాలకమును గమనముంచవలయుననియు, ననుమానమువల దనియు,తనదేశస్థురాండ్రగు, యిటలీదేశపుదొరసానుల యాం తర్యములను,శీలస్వభావములను దనకెక్కువగఁ దెలియుననియుఁ జెప్పెను.

ఇఁకనీదస్త్రము కట్టిపెట్టి,యింకొకకట్ట విప్పినాఁడు. ఎత్తిపొడుపులు,పొత్తికడుపునఁ గుట్టుబుట్టించునవి,విన్నకొలఁది యును,ఒథెల్లోమనసును,కలుక్కుమనిపించుట. తనను బెండ్లియా డుటలోఁ దండ్రిని మోసముచేసినది. మోసమింతయుంత యన రాదు. ఒథెల్లోకు,యిదినచ్చినది. బాణముతనకే గ్రుచ్చుకొను న్నది. కన్నతండ్రినే మోసముచేసినప్పుడు, కట్టుకున్నమగఁడా

గునా? మద్దులుమునింగిపాఱు, వెంపలులు తమ కెంతబంటి యను
ట. అయాగోగారు, ఒథెల్లోను క్షమాపణ వేఁడుకొనినారు—
మనసుకలఁచినందులకు. ఒథెల్లోపైకి చెక్కుచెదరనట్టే; చెక్కు
చెమర్పనట్టే; తలపూవాడక యున్నట్టే ; ద్వంద్వాతీతుఁడయి
నట్టే. అభేదానందుఁడే. లోపలమాత్రము దుఃఖము కొండంత-
అయాగో గారి రామవాక్యములు విని,వారినింక నుబ్రతిమాలును.
అయాగోగారు,ఉపచారములు, అపచారములు, గ్రహచారము
తనది. కేశియో తనకుమిత్రుఁడే, స్నేహితుఁడే, నేస్తకాండ్రమను
కొనువారమే. ఒక్కతొట్టిపడవలో సబురుచేయువారలమే. అ
టువంటివానిమీఁద నేమి చూపుటకును మనస్సుమనస్సుగా లే
దే? నీరై పోవుచున్నదే? మంచిపాలు కారిపోవుచున్నదే?లోపలి
పోరుమిక్కుటమగుచున్నదే? నాతలవ్రాఁత. నేనేమి చేయుదును.
నేనేమి చెప్పుదును? నాకీపాడుజన్మ యెందుకువచ్చినది? అసలు
పట్టుకు దిగినాఁడు. అసలుగాథకు దుమికినాఁడు. నిజమాడిన
నిష్ఠురము. కడునిష్ఠురపుఁబనియే. ఒథెల్లో,ఒక్కొక్కటియును
జ్ఞాపకమునకుదింపుకొనవలయును. స్వదేశస్థులగు, సుకాయస్థు
లగు,మంచిమనువులు పెక్కులువచ్చినను,సరాకరించినది. తగు
దునమ్మా యని తనను వరించినది. తానెవరు? నల్లనయ్యా,నలు
పయ్యా, తెలుపులేనియయ్యా, సాయబయ్యా, యొకమూరు. ఇది
యొక్కటియే దాఖలా,బుట్టదాఖలా, యనుకుంటిరో,యేమో,

గంపంత దాఖలా. కొండంత దాఖలా,మనసునకు మనసు దాఖలా. ఆమెనైజమునకు విరుద్ధమగు ధోరణి. మతము మొండి మతము,చండితనము ; శంఖిని, అని వేఱుగ నొక్కి-వక్కాణింపవలయునా ? అవసరములేదు. తమకు సచ్చియే యున్నది. ఈ మొండి,చండితనములు,రెండునువిఱిగి, కాలమను యిందుపగింజగంధము విఱిచినప్పుడుకలఁకయావత్తు విఱిగి దిగఁదన్నును. అప్పుడెప్పటి యమ్మగారు. తనస్వదేశీయులగు మిసిమి, పసిమిగల యిటలీదేశపుయువకులఁ గులుకురాముల, స్ఫురద్రూపుల, తెలుపులవాడనిఁ జూచి'ఒథెల్లో,అంటే,యేమో యనుకుంటిని ; మోసమైనది'అనుకొనును. ప్రస్తుతము కేశియో-విషయమయి యాపుదల చేయవలయునని,ఒథెలోకు బుద్ధిచెప్పి, ఆఁగినాఁడు. ఈమధ్యకాలమునఁ దనభార్యడెస్డెమోనా, కేశియో వ్యవహారము నెట్టిపట్టుదలతో నడుపడునో, కనిపెట్టియుండవలయుననియు దానిలోనే చూడవలయునది యెంతయో యున్నది ; కావలసినంతయున్నది—రంగము,చదరంగము.అయాగోగారి విద్యను, దుర్విద్యను జూచుటకు ఘనకెన్నికనులున్నను జాలవు.డెస్డెమోనాను, అగ్నిగుండమునఁ బడవేయుచున్నారు. బంగారువంటి యాఁడుబడుచు.కల్ల,కపటము నోటువంటివియో, సెఱుఁగదు.ఆమెయొక్క-సుగుణములనన్నిఁటికినిఁచ్చుగట్టి,ఆమె మూర్తిమంతమును గూర్చుండఁబెట్టి,అనంతశయనముగావించి,కట్టుబిగించి,

మండఁబెట్టనున్నారు—ప్రాణముతోడి బొందెను—ప్రాణనాథునిచే తనే మంటఁబెట్టించ నున్నారు. చిక్కములోని కామెను జేర్చు చున్నారు. మార్గమతిసులభము,సూటిమార్గము. చుట్టు లేదు—కేశి యోను,ఆమెను వెంబడించివెంబడించి, వెన్నాడివెన్నాడి, వేడివేడి,కాచికాచి,మగనిమధ్యనునిలచి,తనయుద్యోగమునకుఁబొరించుట, అఘోరించుటలో, ఒథెలో చెవులు చిల్లులుపడ వల యును. దానిమీఁదనే సమస్తరోగములును బుట్టుకొనివచ్చును. దుంపనాశనముచేయునట్టి, మచ్చమాపునట్టి రోగములు.

అయాగోగారికిఁ జెప్పవలయునా? ఒథెల్లోమనసునంత యును,తరిచినారు,చిలికినారు,వడియఁగాచినారు. 'మహారాజా! నేనుశలవు గైకొనుచున్నాను'అనివెళ్ళబోవును. ఒథెల్లో తనప్రపంచనములోఁ బడినాఁడు. 'నేనేల పెండ్లియాడితిని? వీఁడు (అయాగో)న్నాఁడే,బహు పెద్దమనిషిమనసా వాచా,అబద్ధమన్న మాటలేదు.తప్పకయింకను జాస్తినే చూచియున్నాఁడు; తెలిసి కొనియున్నాఁడు. కానియుఁతయును బయటఁబెట్టఁడు.' అయాగోగారిసరికి మళ్లుచున్నారు. ఒథెల్లోచెంతకుఁ జేరినారు. భూతదయాళురు, కరుణాసమన్వితులు; దయాభూతురు. 'ఎక్కువ తరచవలదు' అనినారు—విషయములను—కాలమునకు వదుల మనినారు. అంతర్యమునఁ దన్నుఁదెలియనివారికిఁ నన్ని దెసలఁ దానయగురీతిబహుమాయా వేషధారియగుచు, అయాగోగారు

ప్రవర్తించుచున్నారు. నటించుచున్నారు. అందఱకును గనికట్టు కట్టినారు. ప్రస్తుతము వీడుపాటు కలుగదు. తిరిగి ముత్యములు రాలుచున్నవి. 'కేశియో, యుద్యోగమునియ్యదగినమనిషి ; చేయఁదగినమనిషి ; కడుసమర్థుఁడు'అనినారు. మీరొకింత యొఁగుపక్షమున,బయలుపడును, మనిషియును మెట్టుఁత్రోవలు ను. ముఖ్యమగుమాట వినుఁడు. మీంభార్యాదొరసాని, కేశి యోఁనొకరికిఁ బట్టుకొని ప్రాఁకులాడినయడల,నందుల నెంత యోః నుండును. ఈలోపుగ మీరేమి యఘాయత్యమును జేయుదురో యనుభయము నాకమితము. నాభయమునకుఁ దగినకారణ మున్నది—అమ్మగారిజోలికిఁ బోవలదు. అదియే నాకోరిక. నా దొరతనమింతటిదియే యనుకొంటివా ? అని ఒథెల్లో. నేను వెళ్ళి పోవుచున్నాను. ఇంకొకసారిశలవుతీసుకొనుచున్నాను. అయాఁగో నటన,అడుగులు సాఁగనట్టే. ఒథెల్లోమీఁదిప్రేమ వెల్లివిరిసి నట్టే.

ఒథెల్లోకు,ఏకాంతము దొఱకినది. ఏకాంగి యయినాఁడు ఏకాంతి యగుచున్నాఁడు. వీఁడు సత్యమును,ధర్మమును అరికట్ట వేసినాఁడు. ఈసొమ్మువీఁడిది. ఇఁక నేరిదికాదు. ఇదియెక్కడ యవగాహనశక్తియో, యెక్కడి తెలివియో, విద్యయెక్కడిది యో, మనుష్యస్వభావములను, నైజములను సమస్తమును దెలి యును. నాకుమాత్రము రుజువుకావలెను. ఇంతవఱకును నెత్తి

మీఁద నెక్కించుకొనిన మాత్రమేమి? మెడకుబండగట్టి,కాలికి బొండగట్టి,విసరిపడ వేయనా? నానలుపుమాత్రము వాస్తవము. ఇతరులవలె, నేనుమాటలను దొర్లించలేను. నాకుఁజేతకాదు. ఏటికి,ఏటికి వయసు దిగజాఱు,దిగసన—వీనినంత యనుకొనరాదు వాకొనరాదు; ఆమె,అధోగతిలోఁ బడినది; పడిపోయినది. నాకిది పడరానికష్టము. గొంగళిపురుగువలె నామెను జాల నసహ్యించుకొనవలెను. అప్పటికిఁగాని నాకు శాంతికలుగదు.ఎక్కడిపెండ్లియో,మాయాధారిపెండ్లి. ఈపుష్పకోమలులు మనవను కొందుము. రాగములు కలియవుగదా.లలాటలేఖను దప్పింప నేరెక్కిఁదరము ?

ఇదిగో,ఆదయ్యమిటులకే వచ్చుచున్నది. డెస్డిమోనా వచ్చుచున్నది. ఆమెముఖారవిందము, ముఖవీక్షణమున నేమియున్నదో, యీామెనుఁజూచిన, నామేతులువ యనిసపక్షమును, యయినపక్షమునఁ బరాత్పరుఁడును, బరలోకమునుఁగూడ లేనట్టే. నేనునమ్మను.

ఇటు అయాగోగారు, కప్పగంతులు, పిల్లిమంత్రములు, మేఁకవన్నెపులి,భార్యయెమీలియా సాయమువలన, డెస్డిమోనా యొద్దనుండు,అద్దకపుఁజేతిరుమాలును జెయిఁజిక్కించుకొనినారు. ఇంకేమి,పుణ్యము. పురుషార్థము కలిసికట్టుకు వచ్చినవను కొనినారు. అయాగోగారు కలిపురుషులు,కర్కోటకనిమేనల్లరు

శనైశ్చరునిఁదోడియల్లురు; తోడఁబెండ్లికొడుకులు. అప్పుడే పాశములఁ బేనినారు; పెనవేయఁ బోవుచున్నారు. కేశియో బసమొద్ద నీరుమాలును దిగఁజాఱుతుననినారు. ఆయనకను గొందురుగాక యనినారు. తీసికొనకతప్పదనినారు. గాలిలోని నలకయైనను గానిమ్ము. అనుమానమేమాత్రమున్నను, వేదాంతములగును. మనసునకతినమ్మికము కలిగించును. ఈశ్వరతుల్యదత్తములనిపించును. ఇది చేయవలయునది; కొంతయో, యెంతయో యున్నది. మూరునకు నావిషముపట్టినది; యెక్కినది; మాఱినాఁడు; చీటికిమాటికి, మాటికిమాటికి మాఱుచున్నాఁడు. గంధకపుటగ్నిగుండమువలె మంటఁబెట్టుదును— పందువాటికాపురమును.

భార్యవిషయమయి, గట్టినిదర్శనములు గట్టిగ దొఱకువఱకు, తట్టువఱకు, గోచరించువఱకు, ఒథెల్లో నిధానింతునని, అయాగోగారికి వాగ్దానముచేసినాఁడు. కాని, వాక్కును, లేదు, దానమును లేదు. రెండును రెండుచూపులఁ బట్టినవి. కలయికలు మనముచూడఁబోము. ఈ క్షణమునుంచి, ఒథెల్లోమనసు, మనసుగ లేదు; గుండె గుండెగ లేదు; గచ్చపొద; బచ్చపట్టు, నిన్నటిరాత్రి, హాయిగ నిద్రపోయినాఁడే? ఆదమఱచి నిద్రపోయినాఁడే? సుఖముగ నిద్రించినాఁడే? మఱునటిరాత్రికిదియేటివింత! నిద్రపట్టించు, పుట్టించు, మందులు, మాకులు, వల్లమందులు, యింక

నేమేమిమందులో,లాభము లేదు; యీనల్లనయ్యకు నిద్ర కరువ యిపోయినది; నందననామసంవత్సరపుఁగరువే. ఉద్యోగములో గము. ఆయుధముపట్టుటకు మొగము లేదు ; చెయి విఱిగిపో యినది. సైన్యపుఁజూపు,బౌవుటాలు,యుద్ధముశృంగారింపు,వీటి నిఁజూచి,యిదివఱకుఁ బొంగిపోయెడివాఁడు. ఢక్క ఢంఢంధ్వని, తప్పెట్రమోత యుద్ధగుఱ్ఱపుసకిలింపు, వీటినిఁజూచి గంతులువై చెడివాఁడు.గరువము ఉత్సాహముబిరుసుఁదనము,యుద్ధసన్నా హపుఁబెళపెళ యుద్ధవీరులకుండవలయునివియన్నియుఁ బలా యనమైనవి. వెనుకటిసంతోషము వెన్నువేసినది. వెదురు వెన్నువేసినట్టే.తనపని యయినదనుకొనును.కాలము తీరినదను కొనును. సమయాసమయములఁ దనభార్యయిబ్లాలనుకొనును; కాదనుకొనును. నాలుకయెటుసాఁగిన నటుసాఁగును. ఎటులా డిన నటులాడును. నిజమనుకొనును. అబద్ధమనుకొనును. నా లుక రెండుచీలికిలక్రిందఁ జీలినది. ఆవిధముననే,అయాగో ధర్మ రాజనుకొనును. తిరిగి కాఁడనుకొనును. అయాగోకుఁ దెలియు క యుండిన బాగుండుననుకున్నాఁడు. తనకుఁదెలియకయుండు నంతవఱకు నామెకేశియోను మోహించినఁదనకేమి ? తనమన స్సునకుఁ బిచ్చిపట్టుకున్నది ; అంటుకున్నది; ముట్టుకున్నది;చుట్టు కున్నది; పరిపరివిధముల బ్రద్దలయినది. అయాగోగొంతుకమీ దఁ జెయివేసినాఁడు. తనభార్య డెస్డెమోనా నేరమునకునిదర్శ

నేము విప్పమన్నాఁడు; యియ్యమన్నాఁడు. కనులకుఁగట్టినట్లు
కనుబఱుపమనినాఁడు ; లేదా, అబద్ధము చెప్పినందులకు, అయా
గోగొంతుక పిసికివేయుదునన్నాఁడు. అయాగోగారు మొగము
మీఁద ధుమధుమ తెచ్చిపెట్టుకున్నారు. కటాక్షస్వద్దీపితుల
యినారు, పయికిమాత్రము. నిజమాఁడిన అంకితనమయినదియే,
నోటిమొట్టమయినదియే, కలికాలము దానికడుపుకాల, మంచికి
మంచి లేదే, నిజమునకుఁగాలము కాదే, కలియుగమే. ఇదియం
తయు సొలాపన.

ఇఁక ధాఁబోవుసది, స్వయం నియోగపద్ధతి, స్వయం నిమంత్ర
ణము. కంఠసీమనుండి వెలువడునవి మాత్రము స్వయంవిసర్జన
మాత్రములు. ఈపద్ధతులవారు, అయాగోగారు, ఓథెల్లోను, ఆడు
చున్నారు. మీరొకమనిషియా? బుద్ధియున్నదా? అంతరాత్మ
యనుచు నొకటి యున్నదా? దైవముతోడు. దైవముతోడు
తేఁ జెప్పుచున్నాను. నన్నుఁదలకొట్టి మొలవేయుదురా? నా
యుద్యోగమును దీసికొనుఁడు. అంతకుమించ నన్నేమియును
జేయలేరు గదా. నానోటికి వచ్చినట్టు నన్నెంతనైనను, నేను
దిట్టుకొనవచ్చును. దీనికెవరియాజ్ఞలు నుండవుగదా. నేనెంత
టి దరిద్రగొట్టువెధవను. నాపరువుమర్యాదలు, నిజాయతీలన్ని
యును పాపముక్రిందఁ బరిణమించినవి. దోషమునకు దిగినవి ;
నేరముక్రిందఁ బుట్టిముంచినవి. ఇఁకముందు క్రొత్తచదువు చ

దువుకొనవలసి యున్నది ; నేర్చుకొనవలెను. దైవమా! లోక
మా! మిమ్ములను నిరుపురను గని,జీవ,బ్రహ్మైక్య వేదాంతరహస్య
ము జూచి,ముక్కునకు సూటిగఁబోవు నావంటి మంచివానికిది
కాలముకాదు ; కాలములేదు, క్షేమములేదు. చాలుచాలు ;
చాలుంజాలు ; ప్రాణముచాలైనది. గూబలలోనికివచ్చినయీ
లాభమునకు—వందనము మీకు ; అభివందనము మీకు ; పున
రభివందనము మీకు. నేఁటినుండి 'స్నేహితుఁడు' అనుమాటను
నానిఘంటువునుండి తీసిపాఱవైచెదను. నాయంతరంగమునుండి
విసరి పాఱవైచెదను. అనురాగమును, చట్టుబండలు చేయుదు
ను. మీ యెడలనాకుఁగలయట్టి,యట్టిట్టిదనరాని,ప్రేమకుఁగదా
యీఫలితము. ఎఱుఁగకపోయి, అనినందులకీపాట్లు ; నాచెంప
లను చెళ్లుచెళ్లున వాయించుకొందును. నాతోడకుఁ బాశము
పెట్టుకుందును. చాలదు. నాతలను, స్తంభమునకు వేసికొట్టుకుం
దును. నాయెడమచేతితో నానోరుమూసికొందును. ఈనోరే
కదా యిన్నిఁటికిని,ఆదిమూలము ; చిత్రమూలమయినది. ఓ
యేసుతండ్రీ ! నామంచి కెట్టిపాట్లు తెచ్చిపెట్టితివి ? నీయొక్క
యు, నీయయ్యగారియొక్కయు మొగముజూచిబ్రదుకు నాకును
ముండ్లకిరీటమును సిలువయు వ్రాసిపెట్టియున్న వేమో ! అనిచతి
కిలఁబడి పోయినాఁడు—నటరాజు.

# ఒథెల్లో—వెనీసునగరపుమూరు.

---

## సతీసుందరి
### గర్భశీతము—చితిపేర్పులు.

---

"క॥ వినఁదగు నెవ్వరు సెప్పిన
వినినంతనే వేగపడక వివరింపఁదగుం
గని కల్లనిజముఁ దెలిసిన
మనుజుఁడెపో నీతిపరుఁడు మహిలో"

అయాగోగారు పునరవతారము,పునరుద్ధారణము.పునః యనుచుంటిమే గాని,పురాణపురుషులు. 'ఒంటినిల్చిరి పురాణ యోగులు యోగమార్గనిరూఢులై' .ఒథెల్లోయాకృతినిఁ బూర్ణముగఁగనినారు. భద్రముఁగంటిమనుకొనినారు. భద్రమెవరికి? తమకే. ఇఁక సర్వభద్రమే; సర్వమంగళమే. ప్రశ్నలకారంభము. డెస్డెమోనా దేవి నవరాత్రము,దశరాత్రమునకుఁ జేరుకొనబోవు చున్నది; దశాంతరముకావలసియున్నది. పువ్వులయద్దకపుఁజేతిరుమాలు తనభార్యచేత నప్పుడప్పుడు చూచితిరా? ఈప్రశ్నతో కొంపలునిప్పంటుకొనుచున్నవి. అట్టిదానిని తానిచ్చితిననియు నదిప్రథమసూడిద యనియుఁజెప్పెను. అవు

నుగదా ! అవుగాక, బాపురే, అదే, చేతిరుమాలుతో మైకేలు కేశియో యింకొక, యింకొక కేశియోకాదు, మీకేశియో, తన మొగము, తుడుచుకొనుచున్నాఁడు. నేనునాకన్నులారఁజూచితిని. చెవులారవింటిని—నిద్రలోఁగూడ మనమనుకొనిన కలవరింతలే? అని, అయాగోగారు. అదియే నిజమగుపక్షమున నేను నిద్రపోదునా ? వారిద్దఱిని గొప్పకశిక్షకాహుతి చేయువఱకును. నీస్వామిపరతకును, స్వామిపరత్వముఁనకు మెచ్చితిలగుర్తుగ, మూఁడుదినములలోపుగనే కేశియోనుజంపుదును. ఇఁకనా తెల్లపందిమాటయో నేనొకింతసేపువక్రించి, త్వరగసునాయాసముగ నంపుత్రోవను బన్నుదును.

అనవుడు, అయాగోగారు, నానేస్తకాఁడుకేశిగాఁడుచచ్చినాఁడే యనుకొనుఁడు. మీకోర్కి కొనసాఁగినట్టే. కానిమా యమ్మగారిని బ్రదుకనిండు. విని, ఒథెల్లోకు మండుపాటు. అమ్మయునులేదు. గంగానమ్మ, చామాలమ్మగారును లేదు. దానిని చావనిమ్ము. గంగలో దిగనిమ్ము. ఇటురా. నాతోడ సాఁగిరమ్ము. ఆ తెల్లమారెమ్మను, నతిత్వరితముగ నంపకముచేయుసాధనము గ్రహింతును. ఇప్పుడుగదానీవునాకు దక్షిణభుజంబవైతివి. దీనికి, అయాగోగారు, దక్షిణమేమి ? భుజమేమి ? ఎప్పటికిని నాసర్వస్వమును మీఁదేను. మీవాఁడనే. కరోమియద్యత్సకలంపరస్మై త్వమేవయితి సమర్పయామి.

నలుసులు,నలకలు గాలివలె నలకన. ఉఫ్అనియూదిన బారెడుదూర మెగిరిపోవును,పారిపోవును. అనుమానగ్రస్తులగు వారికవియే వేదబుక్కులవలె దృష్టాంతములు. ఈశ్వరదత్తములే. తనభార్యచేతిరుమాలు,కేశియోచేతఁబడుట,చూచుట చాలును. మోసపోయిన,ఒథెల్లోకిది చాలును. ఒంకునంటఁజెక్కి వారిద్దతిమీఁదఁబ్రయోగించుమారణవాక్యముపడవేయుటకు,కేశియోకు, ఆచేతిరుమాలెటులదొఱకినదియు విమర్శింపనవసరములేదు. వాస్తవముగ డెస్డెమోనా, కేశియోకు,ఆచేతిరుమాలును బహుమతిగ నిచ్చియేయుండలేదు. ఇంతటియిల్లాలు గృహిణి,తనప్రాణనాథుఁడుభర్త తనకిచ్చినబహుమతిని,యింకొక నరసామాన్యునకిచ్చునంతటిదుండగము చేయునని స్వప్నమునైనను దలఁచరాదు. ఒథెల్లోయెడాటమున,కేశియో,డెస్డెమోనాలు కేవలము నిర్దోషులు. ఏపాపమునెఱుఁగనివారికి, అయాగోగారిధర్మమునఁ బిల్లిబ్రహ్మహత్యలు చుట్టుకొౕన నున్నవి. పాపముకుండ తననెత్తినిఁ బెట్టినారు. భళ్లునఁ బగులువఱకును, అయాగోగారికి నిద్రరాదు. దీక్ష వదులదు. వారు గృహస్థాశ్రమమున నున్నారు. బ్రహ్మచర్యము దాఁటినారు. సంతానము మాట వినరాదు. భార్య ఎమీలియా మాత్రము మంచిది, సాధు. ఎక్కువ తెలివి తేటలుగల మనిషికాదు. డెస్డెమోనా యొద్ద, చేతిక్రింద మసలుమనిషి. అమ్మగారియొద్దనుంచి,

యీచేతిరుమాలును దొంగిలినట్లు చేసినారు.మాదిరికిఁ గావల యుననినారు.వాస్తవము,అయాగోగారికిఁ దెలియును. అన్నియు నన్నికనులనుబెట్టుకొని చూచుచునుండు భగవంతునకుఁ దెలియవలయు. కాని యింటిదొంగనీశ్వరుఁడైనను బట్టఁజాలఁడు. కేశియోమెట్టుత్రోవను బడవేయవలయును. అతనిఁ జెయిచిక్కును. చేపట్టును. డెస్డెమోనాయిచ్చిన బహుమతియనుటకుఁ గైదండయుఁ, జేయూఁతయు, ముంజేతికంకణమునకర్థమును నగును. అయాగోగారిప్రభ శివరాత్రినాఁటి కోటిలింగస్వామివారిప్రభవలె మిన్నుముట్టును ; మిన్నుముట్టించును; మన్నుఁదాఁకును ; మన్నుఁగావించును.

ఒథెల్లో తిరిగి భార్యయొద్దకుఁ జేరవలెను. లేనియెడల అయాగోగారిపాకము పాకమునకురాదు. తలయేమో నెచ్చుచున్నదన్నాఁడు. వాస్తవముకూడ యుండవచ్చును. కణతలకు బిగించికట్టుటకు నాచేతిరుమాలు కావలెననినాఁడు. ఏదో రుమాలిచ్చినది. ఇది పనికిరాదు.తానిచ్చినదియే కావలయును. ఎదుటనున్నయేదియో నొకరుమాలు నిచ్చినది. ఒథెల్లోకోరినది, అయాగోగారిదొరసాని దొంగిలినది మనకుఁ దెలియును. పాపమాడెస్డెమోనాకు, యేమితెలియును. తెలిసిన నింతవట్టు మునుఁగనే మునుఁగదు. లేదనిన,నేమన్నమాట ? ఇదినేరమే? తప్పక యపరాధమే. ఆచేతిరుమాలును దనయమ్మకు నొక

యూఁదుది, ఈజిప్టు (Egypt) దేశస్థురాలిచ్చినది. ఆమెయెఱు కులది.మనుజులమనస్సులమసలు,మెసలు,యాలోచనలను బట్టి యిచ్చెడిది. అది తనయమ్మకిచ్చుచు, తననుసౌమ్యముగఁజే యుననియుఁ గావించుననియుఁ దనతండ్రికామెమీఁదఁ బ్రేమ కుదురుననియు, ముదురుననియు, గూడ చెప్పినది. ఆమెమా త్రము దానినిఁ బౌఆవేయవలయును లేదా యెవరికైనను, యియ్యవలయును. ఆయుత్తరక్షణముననే, అదివఱకామెమీఁ దనున్న ప్రేమయంతయుఁ దప్పును. విఱుఁగును ; అదివఱకున్న ప్రేమయంతయును, నంతటిభీభత్సము నగును. చనిపోవుచునా మె, ఒథెల్లోసుతరత్నమునకిచ్చినది. అచ్చుదలకొఱకుఁ దాను బెండ్లియాడునపుడు భార్యకీయమనినది. సుపుత్రుఁడు మాతృ నాజ్ఞశిరసా వహించినాఁడు. జాగ్రత యనినాఁడు. భార్యను దనకంటెనొక యెత్తుగను, ఆచేతిరుమాలునొక యెత్తుగను జూచి కొనమనినాఁడు. విని డెస్డెమోనా,హడలినది. ఇదియంతయు సాధ్యమా ? అనినది. అవును,ఒట్టు,అనినాఁడుమగఁడు. అది సామాన్యపు జేబురుమాలనుకొంటివో,యేమో,దేవతాజేబురు మాలు. ఈలోకమున రెండువందలసంవత్సరములుమన్నిన యొకయెఱుకులకఱుసాని,అంబపూనినపుడల్లినది. ఆపట్టునిచ్చి నపట్టుపురుగులతిపవిత్రములయినవి.ఆజేబురుమాలు మహిమను డెస్డెమోనా వినినది.భయముచే జావకానున్నదేమో యనుపిం

చినది, పోఁగొట్టినట్టు పతికి స్పష్టమయినది. దానితోడ మగని ప్రేమకూడపోవునేమో యను నవ్రుకామెమనసునకుఁ గలిగినది. దానితోడ, ఒథెల్లో త్రాచువలె తాడిప్రమాణమయినాఁడు. తలఁదొక్కిన తలతిక్క త్రాచువలెనయినాఁడు. జేబురుమాలు కావలెనని నాఁడు. కొండమీఁదికోఁతినైనను గాని తేఁగలదు, గాని యీరుమాలు దొఱకదు. మగని నీయుడుకునుంచి దింపుటకు నేమేమియో త్రిప్పలుపడినది; ఎగతాళిలోనికి దిగినది; నవ్వులోనికి దిగినది. జేబురుమాలునకింత యుపద్రవమేమి? ఏమిపుట్టిమునిఁగినది. ఇదియంతయును బన్నాగమనినది. మైకేలు కేశియో విన్నపమునుంచి మఱలించుటకుఁ బన్నినమిషయనినది. కేశియోను బాగడివేసినది. పోగడ్త దండయే వేసినది. మగఁడు పెండ్లములమధ్య నొకయగడ్త పొంగుకొని వచ్చినది. పాలపొంగుకాదు. పాల వెల్లిపొంగు. రోషరసపాల వెల్లిపొంగ ఆయాగోగారిజ్యోతిషము ఫలించినది. ఒథెల్లోకుఁ బిచ్చిముదిరినది; పండినది; నిండుకున్నది; పూర్తియయినది. గదిలోనుండి యివతలకూడిపడినాఁడు. ఇప్పటికిడెస్డెమోనాకు మగనికేదో యనుమానము తనమీఁద వెనుదవిలినదనుశంక కలిగినది. గట్టిగ ననుకొనుటకు మనస్కరించదు.

ఏలాకో, తనవలని నేలోపముననో, ఆమెకుఁ దెలియలేదు. తిరిగి తననే నిందించుకొనును. తనమగఁడుదారస్వభావుఁడు;

ఘోరగుణము ; ఒక్కపొల్లుమాటనైన నాలుకననంగిట్టదు. వె నీసునుంచి గాని లేక యేరాజ్యాంగతంత్రములోని ప్రమాదము లో, నాయనను గ్రుంగఁదీసియుండ నచ్చును. లేనియెడల నంతటిసౌమ్యతయును, సౌజన్యతయును బోయి, యీచిరాకు వచ్చియుండదు. మర్త్యులు దేవతలా యేమి? పైనుంచియూడి పడినారా యేమి? పెండ్లినాఁటి పెళపెళబాలకమెప్పటికి నట్టి కట్టుకుని యూఁగిసలాడునా? తిరిగి మగనివిషయము నీరీతి ప్ర స్తావించినందులకుఁ దన్నుఁదాను దిట్టుకొనును.

ఒథెల్లో,డెస్డెమోనాలింతలో కలిసినారు. మగఁడీసారి పురియెక్కినాఁడు. మొగముందరనే ఫెడేలుఫెడేలునఁ గ్రేలి నాఁడు. స్పష్టముగనే, అపదేశములేదు, అన్యాపదేశములేదు. తనమీఁద విశ్వాసము పోయినది. ఇంకొకనిని వలచినది.ఎవరి నో,పేరుమాత్రము నోట నుచ్చరించలేదు.ఒథెల్లో యేడ్చినాఁ డు. 'అయ్యో! పాపిష్టిదినమే మీరేల యేడ్చుచున్నారు?' కళత్రమనును. ఇంతవఱకును సకలకష్టములను నతిదైన్యము తోడుత భరించితిననియు, తరించితిననియు—లేమి, రుగ్మత,అవ మానము—యిప్పుడుసంభవించినయామె, యీవిశ్వాసఘాతుక ము, స్వామిద్రోహము తనగుండెను లోఁగఁదీసినవనియును, గుల్లఁగఁదీసినవనియును, బగులఁగొట్టినవనియు ననెను. ఆమెను నొకదుబ్బు, అనినాఁడు. పైకినెట్టుగఁ బుల్లపుల్లగ నున్నదని

నాఁడు,సువాసనకొట్టినదనినాఁడు, పంచేంద్రియములకుఁబోటు, సళుపు పుట్టుకొనివచ్చిన దనినాఁడు. ఒడలొకరణమయినదని నాఁడు, పచ్చిరణమయినదనినాఁడు. గుండెయొక గచ్చుపొద యయినదనినాఁడు ; అచ్చుపొద యయినదనినాఁడు;అచ్చుపొది యైనదనినాఁడు. పుట్టకపోయిన బాగుండుననినాఁడు. తిరిగి,గిరుక్కున,వెళ్ళిపోయినాఁడు.

"చ॥ * తన్నుఁబ్రియుఁడాడిన యప్రియభాషలిట్లయిఁ
సోలవక కర్ణరంధ్రముల సూదులుజొన్పినరీతిగాఁగ బె
బ్బులి రొదవిన్న లేడిక్రియఁ బొల్పఱిచేష్టలుదక్కి నేలపై
వలనఱిప్రాలెఁగీలెడలి వ్రాలిస పుత్తడిబొమ్మకైవడిఁ."

ఈబుల్లెమ్మ,బుల్లితల్లి,చిట్టితల్లి, పైఁడితల్లి, మామిడివాడపైఁడితల్లి,నిర్ఘాంతపడినది. మైసొక్కు వచ్చినది. పనసపిక్క చింతగింజ యయినది.ఏపాపము నెఱుఁగదే. తనప్రాణనాథునిది నిష్కారణము ననుమానమే. ముద్దుమగత పూనుకొని వచ్చినది-ఆమె మీఁదను పరిచారికను బక్క వేయమనినది.ఇఁక నేమియుననలేదు. దుప్పటులు పఱువమనినది.జనులు తమబిడ్డలకుబుద్ధులు మప్పునప్పుడు, సామోపాయములవలనను, సుళువుటుపాయముల వలనను ద్రోవ తీయుదురు. అదేరీతినిఁ దనపతికూడ తననుగూకలు గేకలు వేసియుండవచ్చును. తాను,మాత్రమేమిపెద్దది? మగనికిఁగలిగిన యాగ్రహాము నీరీతిని సరిపెట్టుకున్నది. పడకమీఁ

దకు వెళ్ళినది. మగనిరాకకు నిరీక్షణము. కనుమూసినది. ఆ మెఱయొక్క చెదరిన, బెదరిన మనసు తమోయింపునకువచ్చినది. ప్రాణనాథుఁడు, కారునలు పెక్కి, మిక్కిలినలుపుల నల్లనయ్యె యీగదిలోఁ బ్రవేశము. భార్య చావు తెంపులకే.

స్థలము రాణివాసము; మనయమ్మున్న డ్రెస్సెమోనాపడక గది. పడకమీఁద నిద్ర; మగత,మమత పోయినది గనుక.ఒకదీపము మండుచున్నది.ఒథెల్లో ప్రవేశము.అదే కారణము. అదే కారణము అయ్యో నా ప్రాణమా,తారకలారా,నకిలిలేని,మకిలిలేని,డాగులులేనితారకలారా! మీకు నేఁ జెప్పను.కారణమది యే. కానిండు. ఆమె నెత్తురు నేను స్రవింపను. మిగుల తెల్లని చర్మమున్నదే యీమెది. మంచు తెలుపునుగూడ తెలతెలగావించును. అంతటి తళతళ తెలుపు; నిగనిగ నునుపు, శిరీష కుసుమపేశల మార్దవముల మచ్చమాపను. ఇట్లనుచుంటినే గాని, యీమె చచ్చితీరవలెను; చావక తప్పదు,లేనిపక్షమున, మగవారినింక నెందఱెందరినో ముంచును; ముళ్లుపెట్టుకొనికూడ ముంచును. దీపము నార్పుదును. అటుపిమ్మట ప్రాణదీపిక నార్పుదును. మొదటిదియగు నిన్ను నార్పిన, పశ్చాత్ దొర్లుకొని వచ్చినచో,తిరిగి వెలిఁగించవచ్చును. వెనుకటి కళాకాంతులు తిరిగివచ్చును. కాని రెండవది—నీప్రాణదీప్తి దిగసన్నఁద్రోసినయెడల,పశ్చాత్తులు లేవు. ఒంటికిఁ గాఁక నెక్కించుటకు—పదార్వ

న్నియ జాళువాపసిడి, పుత్తడిబొమ్మకు జీవకళ తిరిగిపుట్టఁబోదు. గులాబీపువ్వును,తీరాత్రుంచినపిమ్మట నెదుగనియ్యగలనా? నా వశమా ? అదివాడిపోవలసినదియేను. అదివాడిపోయినదాని లోఁజమయే. కాఁబట్టి, చెట్టునే యుంచి వాసనఁజూచెదను. [ముద్దాడును. భార్యా రమాలలామను] హాసురభిశ్వాసమా! న్యాయమూర్తియొక్క ఖడ్గమును ధ్వంసము చేయవలసినదని చెప్పక చెప్పుచుంటివి–నీప్రభావమట్టిది.ఇంకొకసారి–ఇంకొకసా రిచచ్చినతరువాతకూడ నీరీతిగనే యుండుము. చంపి,తరువాత నిన్నుఁగామించెదను. తిరిగి యింకొకముద్దు. ఇదియే ఆఖరు, ప్రాణాంతకము గనుకనే,మరణాంతకము గనుకనే,యెక్కడలేని మాధుర్యమును. నేనేడువవలెను; ఏడిచి తీరవలయును. క్రూర ము క్రూరమే; కాక తప్పదు; బాష్పములు జలజలయే–ఈదుః ఖముసూత్రముపరమాది. కడుపుమీఁదఁ గొట్టుచున్నది. ఆమె లేచుచున్న దే?

లేవనే లేచినది. కాఱుచిచ్చు పొట్టలోనున్నప్పుడు,మం డునిప్పు గుండెను దహించునప్పుడు, సిండునిప్పు తలమీఁదికో అవులయి బ్రహ్మకపాలము, కపాలమోక్షముఁ బెటబెటలాడించ నున్నప్పుడు డస్సెమోనా, ముద్దులబిడ్డకు నిద్ర పట్టియేడ్చినదా? నిద్రకాదు,పెద్దమ్మవారు మూసించుకొని వచ్చుచున్నది. ఒథె ల్లోబాబు, బండబాబు అయినాఁడు; యమధర్మరాజు కాఁబో

పుటయే తరుగు. అయ్యో తండ్రి, యెవరికిఁబుట్టినాఁడో, యెక్కడ పుట్టినాఁడో యెప్పుడు పుట్టినాఁడో దైవమెరుగును నమ్మినచేత మడియవలయు తనకనులు చల్లఁగ నుండును. ఆ ఘడియ యింకను రాలేదే? ఎప్పుడు, ఎప్పుడు? అనుచు అయ్యో, తరువాయి పండుగకు, పండువకు తహతహ!

ఇటు ఒళ్లో, పడకటింటిలో భార్యచక్కని, యుండి, క్రిందిపెదవి కొఱికికొనినాఁడు. కనుగ్రుడ్లను గిరగిరలాడించినాఁడు. ఈవాలకము మగనిది, కొంపలుముంచు వాలకమని తెలియును. చావుకు సిద్ధముగ నుండవలయునని భార్యను గోరినాఁడు. ఆఖరుప్రార్థనలను జెప్పుకొన మనినాఁడు. ఎందుకనఁగా, నా మెయ్యాత్మను జంపఁకు. అమాయకపుఁబిల్ల, కల్ల, కపటమెఱుఁగని పిల్ల మగనిపాదములమీఁదఁ బడినది. మాతా నాస్తి, పితానాస్తి,అన్యథా శరణంనాస్తి త్వమేవశరణం మమ త్వమేవ, మమభాగ్యం, పాహిమాం పాహిమాం. అనినది. "తే. నిన్ను శరణంబు వేఁడెద నీళ్ళముంపు। పాలముంపుము వేయును బల్కనేల?" తనతప్పిదముఁ దెలుపవేఁడినది. ఇంకేమి? నిష్ఠురములపుట్ట, పాపములపుట్ట బయటకుఁ దేలుచున్నది. కేశియో నాయకు నెత్తినాఁడు. యెత్తిపొడిచినాఁడు. జేబురుమాలు కలిపినాఁడు. నిరపరాధిని, నిర్దోషురాలు, అన్నినిర్లకును నిధి, తనమీఁది యపనిందల కప్పు సడలింపఁబో

వుసరికి భార్యగొంతుక పిసికివేసినాఁడు. ప్రాణనాథుఁడే—ఓ రంతప్రొద్దు దాఁటినది—ఆరాత్రి.

పరిచారిక, ఎమీలియా యెక్కడనుండియో దోర్లకొని వచ్చి చూచి, పడిన తొట్రుపాటునకు, డెస్డిమోనా, ఆకులపాటు. 'అన్యాయముగఁ జస్తిని. అన్యాయముగఁ జస్తిని' అని పరివేదనము. ఎమీలియా పలుకరింపు. ఏపాపము నెఱుంగని చావును చచ్చుచున్నాను. ఎవరు చేసినది తల్లీ! ఎవరికిఁబుట్టిన దీపుండు? యని ఎమీలియా, మనయమ్మ, మనతల్లి, డెస్డిమోనాతల్లి యిచ్చిన జవాబు మేమి? జవాబదియేమి? ఈరేడు లోకములకును దులతూఁగుమాటలు. ఎవ్వరును గాదు; నేనే; నాకు నేనే; వెళ్ళుచున్నాను. నా ప్రాణనాథులకు, నాదయావారిధులకు, నామీఁదయయు, నంతఃకరణముల నుంచవలయు నని మాత్రము చెప్పుము. అయ్యో! వెళ్ళిపోవుచున్నాను. [చచ్చును].

తిరిగి క్రొత్తరంగము. మూర్ఛోమురంగము. మొగము వాపురంగము. రంగఁడు కాంతావిరహాసుదుఃఖితుఁడు, నా పెండ్లాము! నాపెండ్లాము ఇఁక నెక్కడి పెండ్లాము? వేధన దుర్భరమే? అపారపారావారమే? ఎటులు సాఁగని గంటయే. రవిసోములకు ఘోరమగుసంపూర్ణగ్రహణము పట్టినట్టున్న దే? దీనికి భూమీదేవిగాభరాపడితనకను తెప్పలఁదేల వైచునట్లున్న దే?

సంగతులు దెలిసి యూరంతయు నట్టుడికినట్టయినది. ఒథెల్లో పినమామగారు గ్రాషియానో (Gratiano) పరుగిడి వచ్చి, యేమియిది ? అనినాఁడు. 'నావైపుఁజూఁడుఁడు. చేతఁ గృపాణ మున్నది. అంతకుమించినమేలయినది మఱియేయితర రణవీరుని తొడమీఁద నానియుండదు. నాయీ చిన్ని బాహువులీమంచికత్తితో నెన్నియేని సాములు చేసినవి. నేను సామర్లకుఁ గట్టనికోట. కోటబురుజను. ఏన్నియో యంతరాయములును, విశ్వామిత్రములను గడతేరినవాఁడను. ఇప్పుడు మీరు పెట్టుచున్న పెట్టనున్న కడగండ్ల కిఱుపదుల మడుంగు లెక్కుడుయే, నేను వెళ్ళఁబుచ్చినదినముకూడ నాకనులముందర గడచినది ; సాఁగినది. కాని,యిదియంతయు నెందుకు వచ్చిన యాత్మశ్లాఘన,ప్రగల్భములు ? నుదుటిలేఖఁ దప్పింప నేరితరము ? గతజల సేతుబంధనము. ఆయుధహస్తుఁడనై యున్నాను,చూచి మీరుఝడియవలదు.నాప్రయాణము ముగింపునకుదిగుచున్నది.దిగసన యాసన్నము. సబురు కడముట్టుచున్నది. మీరేల భయపడి వెనుకకుఁ దగ్గెదరు ? నన్నుఁజూచిన జనులకు భయము గియము,యెన్నఁడో పోయినది. ఒకగడ్డిపరకను ఒకదర్భను ఒథెల్లోమీఁద విసరినయెడల, నాపరకయు, దర్భయునొక బ్రహ్మాస్త్రమయి,ఈ ఒథెల్లో యొకపిచ్చుకయయిమఱలును. ఒథెల్లో యిప్పుడెక్కడకుఁ బోవలెను? పోఁగలఁడు ?

బహిఃప్రాణమా! నాడెస్డెమోనా! ఎట్టివాలకము పడినది నీకు ? ఏపాపిష్ఠినక్షత్రమునఁబుట్టితివో! ఏ లగ్నమో! ఏ మాయరాశి యో. లోని కంచుకమువలె కళాకాంతులు తగ్గి యెటులనుంటి వో. ఆచిత్రగుప్తుఁడు,నాచితా,ఆవర్జాలను బయటకుందీసినప్పు డు పారిపార్శ్వమునన్నుండివీక్షించు నీవీక్షణమేచాలును.స్వర్గము వీనికి నెలవుకాదు. త్రోసివేయండి. అనుట తడవుగనే పిశాచ ములు నన్నీడ్చివేయును. ఓనాపడుచా, చల్లఁబడిపోతివే ? అం తటి పాతివ్రత్యము నీకైనదే? నేనొకపాడుబానిసవాఁడ నైతి నే? ఓ దయ్యములారా! ఓ సీమదయ్యములారా! ఓ ముసలి మానుదయ్యములారా! దేశమధ్యమున నుయ్యలలూఁగు స్వ దేశిదయ్యములారా,మీరందఱును గుమిగూడి కొరడా పట్టు కొని కొట్టుఁడు నన్ను— ఈ దేవతలున్న చోటు నుంచి గాలి కె గురఁగొట్టుఁడు. గంధకపుజ్వాలలలోఁ బుటము వేయుఁడు.ని ప్పులసీళులలో శుద్ధిగఁగడిగివేయుఁడు. అయ్యో నాడెస్డెమో నా. అయ్యో డెస్డెమోనా, లోకమున కంతకును నమోనా. ఇఁక నెక్కడి డెస్డెమోనా ? చనిపోయినది. అయ్యో! అయ్యో,అయ్యో,పరాగభర భరితంబై,నిరతము జగదేకమనో రమగు నంతటికుసుమరాజము నీకును బరిమళము సెడినదే ? వాడినదే ? పరువము దప్పినదే ?

ఇదేసమయమున, కేశియోను,గాయములు తగిలి నేత్రు

రు ప్రవించుచున్న వానిని యింటికిఁ దీసికొనివచ్చిరి. అయాగో, తనపరిజనులలో నొకరిని రోడరీగోను, కేశియోను జంపుటకు శికొల్పినాఁడు. కాని కొనముట్టలేదు. అనుకొనిన ప్రకారము కొనముట్టలేదు. అనుకొనినప్రకారము కేశియో చావలేదు. ప్రాణావశిష్టుఁడయినాఁడు. గాయములు దిట్టముగఁ దగిలినవి. అయాగోపుట్టిమునుఁగునని చంపఁదలఁచినాఁడు. ఈపట్టున కేశియో జేబులోఁ గొన్ని యుత్తరములు దొఱకినవి. వానివలన, అయ్యాగో దుష్టబుద్ధియును, చర్యయును, కేశియోనిర్దోషిత్వమును, ననుమానరహితముగ విశదమయినవి. కేశియో, ఒథెల్లోయొద్దకు వచ్చుటకిందుకొఱకు. అయాగోవలనఁ దాను చంపింపఁబడుటకుఁ దానుచేసినఘాతయేమి యనియడుగుటకు వచ్చినాఁడు. ఈసంగతులన్నియును ఒథెల్లోకుఁ బిడుగుపెట్టుయేను. ఇప్పటికిఁ దేటతెల్లమయినది. తానొకహంతకుఁడు. తనభార్య యిల్లాలు, పతివ్రత, పుణ్యశీల, నిరుపమగుణశీల. తనయెడల నపరిమితవిశ్వాసము. నిజము తెలిసి భరింపలేకపోయినాఁడు. చతికిలఁబడిపోయినాఁడు.

ఊరిపెద్దలు, పెత్తనదారులు మూఁగిరి. ఆదురుసువాఁడేడి? ఆ తలమాసినవాఁడేడి? అని లొడొవికొ (Lodovico), డెస్డెమోనా పుట్టింటిచుట్టము. నేనే వాఁడు. నేనిక్కడనున్నాను. కాని, యా గాడిదకొడుకేడి? ఆజెత్తిగొడ్డు నిటీడ్చుకొని రండు. వంగి వాని

యరికాలును జూచెదను. సాముద్రికము నరసి తిట్టిపోసెదను. నాకేల యారభస? అదియంతయును బుక్కిటిపురాణము. నీ వాకలిపురుషుఁడవేనైనను,నీవు చంపఁదగినశత్రుఁడవేనైనను, నిన్నుఁ జంపఁజాలను, అపాయమమాత్రము గలిగింతును. లొడావికో, ఒథెల్లోచేతినుండి కృపాణమును బలాత్కారముగ లాఁగవలయునని. అయాగోకు నెత్తురుమాత్రమే వచ్చినది. ప్రాణభయములేదు. నాకేల యావిచారము? నీవీరు నిలఁబడి యుండుటయే నాకోరిక—నడపీనుఁగా! ఈరంగమున నీవు గిట్టుట నీకులాభసాటిపని—ఇది నాయభిప్రాయము.' అని ఒథెల్లో 'ఈచిలుకపలుకులకేమిగాని,నీవంతటి మంచివాఁడవుగ నుంటివే, అంతటిబ్రదుకుయును బ్రదికి,యూరివెనుక జచ్చినట్టు,తుట్టతుద కీపనికిమాలినవెధవ వలఁగోఁ బడిపోయితివే? నీవిషయమేమి యందును? ఏమనందును నీవిధి? ఎవరు మాన్పఁగలేనిది? చూచినవారేడ్వఁదగినది.' అని లొడవికో.'మీరేమయిన ననండి. ప్రాణఘాతకుఁడనే. అవును; దగాఁ జేయలేదు. వంచన చేయలేదు. ములుకుట్లు కుట్టలేదు. రాజారోషుగఁ జేసినాఁడను. కావలసినంత దర్జాగాఁ జేసినాను. ద్వేషము అసూయాదులు నాయింటను వంటను లేవు. పరువుప్రతిష్ఠలకుఁ బ్రాకులాడి గావించిన పనియిది. ఈచండాలుఁడు,కొంతవఱకుఁ దనఘాత నొప్పుకొనినాఁడు.' ఒథెల్లోచెప్పిన నిదియంతయువిని 'కేశియో

నుజంపుయత్నములో మీరిద్దఱును ఫెయిల్,అయినారా?' అని లొడవికో,ప్రశ్న. ఒథెల్లో,అవునన్నను, నదురుయు బెదురుయును లేక. కేశియోకు ఆశ్చర్యము,చోద్యము,కుచోద్యుఁడుకాఁడుగనుక. 'నాప్రాణప్రదులగు సేనానాయకులేమీరు. అంతటిదానికి నేనెప్పుడునాస్పదమియ్యనివాఁడనే. ఒథెల్లో యొక లేసరళస్వభావముగలవాఁడుగనుక, 'నీవుచెప్పినది వాస్తవమనియిప్పుడు నమ్మితిని.నీకు.దూషణ వేఁడుకొనుచున్నాఁడను. దీనికంతకున్ను గారణభూతుఁడున్నాఁడు అనక్కలాఁడు; టక్కులాఁడు; మాయలాఁడు: మటుమాయలాఁడు,మాయధారివాఁడు, కలిగాఁడు,శనిగాఁడు,వానిని నడుగండి—నానిలువు,నిస్త్రరము, అస్త్రశస్త్రములుడిగించి,నన్నుఁ జలపట్టి,జలగడుగు గడిగి,నాకు జలగవలె పట్టుకొని,నాచువలె చుట్టుకొని,చెదపురుగులవలె లోనికండనుదిని డొలకను గావించి యీయమపాట్లనన్నిఁటి నేలపెట్టితివని వానినే నడుగుఁడు.' అయాగో వెధవ గొంతుక వినవచ్చుచున్నది. పొట్ట విచ్చవలసి యున్నది. మేడిపండు మేలిమియయిపోయినది. 'నన్నేమియు నడుగవద్దు. మీకుఁ దెలిసినదేదియో,తెలియనే తెలిసినది. ఇప్పటినుంచి నానోరు నేను మెదుపను; పెదవి సడలనీయను.' 'ఏమివిడ్డూర్యమిది? ప్రార్థనకుఁ గూడ మెదుపవా? దెబ్బ దేవేంద్రలోకముఁ జూపును. రాజేంద్రునయినను.' అని గ్రాషియానో. నోరు మెదుపనిదే యమ

న్నిఁటికిని మందు,అని ఒథెల్లో. 'మీాకిదివఱకుఁ దెలియునో తె
లియదో చెవియొగ్గివినుఁడు, చనిపోయినరోడరిగో జేబులో రెం
డుజాబులు చెయిచిక్కినవి. అందులనొకటి, కేశియో మరణ
ము రోడరిగోవలనఁ గొనసాఁగవలెనని తెలుపును.'ఓరివెధవా'
అని ఒథెల్లోయును, 'ఎంతటిఛండాలుఁడవురా? నీవు' అని కేశి
యోయును. 'ఇదిగో,యిదియొకచాలు, మూలం,లేని యుత్తర
ము. వానిజేబులోనే కనుబడినది. ఈకుక్కలకొడుకునకుఁ బం
పఁదలఁచినాఁడు. ఈలోపుగ రోడరిగోకు దుర్మరణమువచ్చినది.
చాలు మూలం చావులోఁ బడఁగలసినది' అని లోడవికో. ఒ
థెల్లో 'ఓరితొత్తుకొడుకా! ఎంతపని చేసితివి?' అని కేశియో
వైపునకుఁ దిరిగి,యేమయ్యా కేశియో! నాభార్యచేతిరుమా
లు నీకెటులఁ జిక్కినది? అనినాఁడు. కేశియో అయ్యో, నా
ప్రారబ్ధమా, నాగదిలోఁ బడియుండినది ; తీసితిని. వాఁడే
మీాకొప్పిదము చేసినాఁడే ; ఏదియో రాచకార్యము మండఁ
బెట్టుటకు నాగదిలో జారవిడిచినాఁడఁట. ఒథెల్లోకు గుండెల
వియు నాశ్చర్యములు. ఇచ్చవచ్చినట్లు అయాగోను దిట్టుట
యే. కేశియో-రోడరిగో యుత్తరములో నింకను సంగతులు
న్నవి. అయాగోను దిట్టిపోయును. తిట్టిపోయఁడా ? ధనము అ
యాగోకు వెదఁజల్లినాఁడు. అయాగో,ఆశపెట్టినాఁడు ; ఆశ
పుట్టించినాఁడు. డెస్డెమోనాను దనసొమ్ము. అనిపింతును, అని

నాఁడు. ఆమెకిత్తునని,ఆమెపేరుచెప్పి,నగలేమి, రొక్కములేమి, వానియొద్ద కాఁజేసి,స్వాహా చేసినాఁడు. ఔపాసనము గావించినాఁడు. అసత్యంవర్తులేన అప్రదక్షిణం పరిషించామి యనినాఁడు. అలనాఁటి కావలిరేయి కేశియోను మత్తిల్లునట్లుచేసి రోడరిగోను మదమత్తునిఁజేసి,డెస్డెమోనా విషయమాశలకాశలను బెంపునొందించి,ప్రాణరక్ష గావించెదనని కొండంతకోరికలను బుట్టించి వస్తువాహనముల నూఁచముట్టుగ గ్రహించి, భూక్షేత్రములను,సుక్షేత్రములను దెగనమ్మించి, పైపెచ్చులు కేశియోరోడరిగోల యిద్దఱిని మై మఱపించి, మానాభిజాత్యముల దిగనాడింపించి, కత్తులుదూయింపించి, మధ్యస్థముగ నడ్డుపడిన మాంటెనూను, గాయములఁగుందించి,తుట్టతుదకు,డెస్డెమోనా చావునిశను, కేశియోరోడరిగోలకిద్దఱకునుగూడ మారక యోగమును వ్రాసిపెట్టినదీకలికాలపుబ్రహ్మగాఁడే. శివశివా,హరహరా! రోడరిగోను కావలినాఁడు,ఉసికొలిపినందుల కుత్తరకాండయేగదా, కేశియోయుద్యోగమునకు మంగళము. ఇంతకు మనుపేగదా,చావునకుముందు,అయాగో, తనకా గాయములు తగిల్చెననియును,తన్నాతరువాయివృత్తాంతమునకు దింపెననియు నఘోరించెను.రోడరిగో లొడవికో—మీరందఱు సీగదివిడువుఁడు. మాతోడ రండు. ఒథెల్లోవైపు చూచి, నీయధికారమును, నాయకత్వమును బడఁగొట్టినారము.ఈబానిసకొడుకు (అయా

గో) మాటయో, చిత్రవధ, కీచకవధ, కీచు, కీచుమని, యెంతయో సేపు నిలువు చీరు వధ కానిది. ఒథెల్లోనుజూచి, వెనీసుదొరతనమువారికి నీనేరము తెలియపఱచి, పర్యవసానము తేలువఱకు, ఇయిదీగ నుండవలయును. అతనినిఁ దీసికొనిరండు."

ఒథెల్లో చ్యుతరాముఁడు, చేరిక నున్నవారి నొకటిరెండు మాటలువినఁగోరినాఁడు- తాను వెళ్లులోపుగ. వినుండు. దొరతనమునకుఁ గొంతసేవఁ జేసితిని. అదివారికిఁ దెలియును. ఆత్మగుణస్తవనాంకితము గిట్టనిపని, వాచవి కాదు. ఇతరులకుఁ గర్ణకఠోరము "క. మతిఁబరికింపఁగ నాత్మ। స్తుతియును బరనిందయును వి శుద్ధాత్ములు దా।మతికలుషమం।దు। తగద ద్భుతమొదవఁగ నన్ను నేనె పొగడుకొనంగన్" మీరువారికిఁ దెలియపఱచునప్పుడు, యీ గ్రహచారమును దెలుపునప్పుడు, అనవసరముగు నలుపు పట్టించవలదు, కలరూపో, కాకిరూపో, యేరూపో, ఉన్న యారూపును మాత్రము, విశదము చేయుఁడు. కలయట్టు మాత్రము, తెట్టువలు లేకుండ, తేల్చుఁడు. ఉన్నదానిలోఁ దగ్గించవలదు; మాసికవేయవలదు అసూయవలన లేనిపోనివి కూడ తెచ్చిపెట్ట వలదు. ఇఁకఁదరువాయి వినుఁడు. నేనతిగాఁ గామించినవాఁడను కాని చవటవ్యవహారము మాత్రమయినది. ఒకపట్టున ననుమానముపడువాఁడను గాను, అనుమానపడెడు వాఁడఁగాను. ఉచ్చులోఁ బడినాను. ఉచ్చులోఁ బడినపిట్టవలె నయి

తినిమత్తి,అత్తి,గతిలేక, మతిపోయినవానివలె నయితిని. ఒకమం చిముత్యమును జేతులాౘనలిపి నైచినాను,వాఁడు నాఁడే, ఆకో యవానివలెనే నయితిని. ఆయొకముత్యమును నాబలఁగమున కంతకును దిగమ్రుడుపే కదా ఈముప్పులవల్ల లొంగిపోయితిని. నే నెంతయాపుకొన్నను, ఆగుటలేదు. బాష్పకిణములు రాలుచు న్నవి. వెనుకటి వాఁడు వీఁడు కాఁడు. నేనొక క్రొత్తనేను.అరే బియాదేశపు సాంబ్రాణిచెట్లకేరీతిగ నప్రయత్నముగ జిగురుబ యటకువచ్చునో, అదేరీతిగనాకనులనుండి నీళులుకారుచున్నవి.

ఇదిమాత్రము మీరుఘంటాపథముగఁ జెప్పఁడు. నేను బెద్దజీకములోనివాఁడనే. చిన్నెలువన్నెలు, పెద్దజీకపువియే,తల పాగలు,తట్టతలపాగలు. నామనసు కాలిపోను. నిష్కలంకపా తివ్రత్యనిధి వేనీసుదేశపుఁబడుచును, అల్లపొల్లెఱుంగని యువి దకు లేనిపోని అంకులనుగట్టి,త్రికరణశుద్ధిగ నిజములనిన నమ్మి, గొంతుకఁగోసి రాజ్యమునకంతకును, రాజ్యాంగమునకంతకును, దుర్యశము అపఖ్యాతి తెచ్చిపెట్టినందులకు, నే నీబుద్ధిజాడ్య జనితోన్మాదుఁడనగు నేనీపాపుశ్రోత్రియపుతురుష్కపుఁ గుక్క ను మెడఁబట్టుకొని,నులిమితినని, యీలాగున నులిమితినని పుర మంతయును జాటిచెప్పుడు.

(అనికత్తితోఁ బొడుచుకొనును)

లోడవికో - నెత్తురుబిందువుతో, నాఖరుచుక్క, నిలుపు చుక్క, ముక్కచుక్కలు చుక్కఁబెట్టుకొనినాఁడే, తినచేతులార. గ్రాషియానో - అన్నిపలుకులును బలికి తుసుక్కుమనిపించినాఁడే. ఒథెల్లో కడపటిమాటలున్నవి. విని, మనమందఱమేమువ, లయును. నిన్నుఁజంపుటకుఁ బూర్వము నేను నిన్ను ముద్దాడితిని ముద్దులాడితిని. ఇదే త్రోవ ; ఇంకొకత్రోవ లేదు. నన్నుఁ జంపుకొని, చావక మును, ముద్దాడి, ముద్దాడు నెడఁ జత్తును.
(పడకమీఁదఁ బడును. చచ్చును.)

ఇఁక మనపూర్వోత్రపు కేశియో మిగిలియున్నాఁడు. ఇదిజరుగునని నేను భయపడితిని. చేత నాయుధము లేదనుకొని నాఁడను. మనిషి యెంతటిదొడ్డవాఁడనుకొన్నారు ! ఒథెల్లో మామగారు బ్రబాన్షియోకు రక్తస్పర్శబంధువు, లోడవికో, అయాగోను జూచి ఘోరియమకుక్కా ! జముశ్వానమా ! నీ యంతటిపరమఛండాలు లెవరును లేరు ; ఉండరు ; ఉండబోరు; కనలేదు; కనము, కనఁబోము, వినలేదు, వినము, వినఁబోము. ఈ పడకమీఁదిఁ సరుకులను జూడుము. మూటలను జూడుము, ఇది యంతయు నీపని. నీహృదయమొకసాక్షికము. చెయిచిక్కినయు త్తరములే ప్రమాణమును మించినసాక్ష్యము. నీపాపిష్ఠిపనిఁ జూచినఁ గన్నులు ప్రేలిపోవును. పైన నేదేనిఁ గప్పుఁడు. ఒథెల్లో యొక్క పినమామగారు గ్రాషియానోనుజూచి, యీయిల్లువాకి

లి చూచుకొనును. వస్తువాహనములు వప్పఁ జెప్పుకొనును. మీరే ఒథెల్లోకు, అనంతరవారసులు. మండలాధిపతివైపుఁ దిరిగి, "యీఅయాగో వెధవను యేమిచేయుదురో చేయుఁడు. ఎప్పుడు? ఎక్కడ? ఎట్లు? మీకుఁదోఁచినట్లుగావింపుఁడు; శాసింపుఁడు ; శిక్షింపుఁడు. నేను దక్షిణముకు బయలుదేరుచున్నను. దొరతనమువారికీపుట్టి మునుకను గుండెబరువుతో విన్నవింతును.

ఈకార్యములు, సూరేకారముపాలెక్కుడువి ; కొంపఁ గూల్చుకొనినవి, ఆత్రోవను వెళ్ళుబొమ్మకు, వచ్చుబొమ్మకు, హాడలు,ఆశ్చర్యములు గలిగించినవి.ఒథెల్లో యనిన జనసామాన్యుఁడా. మాన్యుఁడు, నాయకుఁడు, సుప్రసిద్ధుఁడు, రాజయోగి. గ్రహచారవశాత్తు,గోచారవశాత్తు, యొకదురాత్ముఁడు దాఁపరించినాఁడు. అతనిమీఁద నెక్కి,త్రొక్కి,తన్ని,సవారీ చేసినాఁడు ; పడఁగొట్టినాఁడు. ఒథెల్లో ఉదాత్తస్వభావుఁడు ; అనుమానముపడునట్టిస్వభావము కాదు. భార్యను మిక్కిలిప్రేమించు,కామించు భర్త. చూచిన ముచ్చటపుట్టించు దంపతులు. తెలివిగా మాత్రము ప్రేమించి యుండలేదు. అతిగ,మాత్రము ప్రేమించినాఁడు. అందటి మాదిరి తఱచుఁ గంటఁదడిపెట్టుకొను వాఁడు కాఁడు. గంభీరుఁడు, పరాక్రమవంతుఁడు.తప్పుచేసితి నని తెలిసికొనినప్పుడు జలజల బాష్పములు రాలవలసినదియే. అతఁడు చనిపోయి నశిమ్పట,అతనివెనుక టివఁచి, సుగుణములు

ప్రతిభ, పౌరుషము కార్యము యశము జ్ఞప్తియందుంచుకొనిరి. మఱపునకు రాలేదు. ఇంతటి యమసూత్రమును బన్ని అప్రతి హతముగఁదనసంకల్పమును హుతముగావించుకొని, యెదుటి వారిని హతముగావించిన అయాగోను,న్యాయచట్టము లేమేమి శిక్షలను రక్షలను వేయఁగలవో వానినన్నిఁటిని విధించి యమ బాధలను బెట్టించి తలకొట్టివేసిరి.

వెనీసుసంస్థానమునకు విషాదకరమగు, తమప్రతిభావం తుఁడగు సేనాధిపతియొక్క,వినిన గుండెలవియు చావును ధ్వని యపర్చిరి. దేశమునకంతకును, సంపూర్ణగ్రహణము పట్టినది. సూర్యుని గ్రహణమే. ఒథెల్లోది, రవితేజస్సుయే. చేతనుండినది పవియే. కేతిగాఁడు,మైరావణుఁడు,అయాగో. సంపూర్ణగ్రహ ణము పట్టించువఱకును, ముప్పదిమూడుగంటలును నిద్ర పోని య్యలేదు. నసాళము నంటినది. ఒథెల్లోను నిద్రపోనియ్యలే దు. ప్రళయమనఁగ వేఱుగ లేదు వెనీసుప్రజలకు. అహహా! పగవానినిఁగూడె నాదైవమును,అనుకొనినాడు. అయాగోవలన ఒథెల్లో,అగ్గిరాముఁడయినాఁడు. తుదకు భగ్గుమని బుగ్గిరా ముఁడయినాఁడు.భార్యమీఁది కశి,ఆమెను మసిచేయువఱకును యినుపగుగ్గిళులే. ఎంతఁజెప్పకొనినను,మనసు కొఱుకుపడ లే దు. తీరా,మసిమైన పిమ్మట గుగ్గిళులు చిమిడినవి. పప్పు చిమిడి నది ; పెసరపప్పు. మైరావణమతము. మైరావణ చరితము,అ

యాగోది,అని విదితము. మన్నుకు జీవప్రతిష్ఠ యెక్కడ? గుడి
లోని లింగమా యేమి? అయాగో తిమ్మనిబ్రహ్మనిఁ గావించిన
ను,బ్రహ్మనిఁదిమ్మనిఁ గావించినను,ఒ ళ్లోకు, దేనిక దేనమ్మిక ;
అతినమ్మకము,బహునమ్మకము, ఛాందసుఁడు, ముసలిమానుల
లో ఛాందసుఁడు. మొగమునవ్వుచు,నొసలు వెక్కిరించుట యే
మియో నెఱుంగఁడు. నిశ్చయాము చేసికొనినపిమ్మట నచలుఁ
డు. సింహాచలమే. కత్తివచ్చిన మొండిరాకాసి. నిప్పు వంటి
వాఁడు. నల్లనిప్పు,చింతనిప్పు ; నివురుగవియుట లేదు. ఎప్పు
డును గణకణలాడుచు నుండవలసినదే. లోనిదీప్తి వెలుపలకుఁ
గక్కవలసినదియే. భార్యయనిన నారని యాపేక్ష. వెఱ్ఱిడస్సె
మోసా గంగిగోవు. తాను బావని యనియు,నిష్కళంకిణి య
నియుఁబూర్ణముగ నమ్మకము. కేశియోపక్షమున, నొకజలగ
వలె మగనిఁ బట్టినది. పట్టినపట్టు విడువదు. మంకుపట్టు. చిన్న
నాఁడు తల్లియొద్ద మంకుపాల నెక్కుడుగఁద్రావినదియోయేమో!
తనమీఁద నీలాపనిందలు,విఱుచుకొని పడుననియును,దొర్లుకొ
ని పడుననియును,యీ వెఱ్ఱిజానికమ్మకుఁ దెలియనే తెలియదు;
తట్టనే తట్ట లేదు. నిమ్మకు నీరెక్కినట్టు ద్వేషము,యెంతచల్లఁగ
చల్లచల్లఁగ నెక్కినదియో, పాదరసమువలె నెంతవేగముగ నె
క్కినదియో తనహంగుల నెంతచాకచక్యముగనమర్చుకొనెనో,
తనకక్ష నెటులఁగొనసాఁగించుకొనెనో, లోకమునకంతకును వి
దితము.



# తప్పొప్పుల పత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 13 | మానవాంతి | మానమంత |
| 7 | 20 | దగిస | దగిన |
| 8 | 3 | ఒరులులే | ఒరులుసే |
| 19 | 10 | జేవయా | సేవయా |
| 25 | 2 | ఫ్రందు | ఎాదుకు |
| 26 | 11 | యుయన | యయిన |
| 31 | 1 | యనయొద్దకు | ఆయన యొద్దకు |
| 32 | 17 | ంోడిద | [illegible]డిద |
| 38 | 1 | చేయుఁడని | చేయుఁడని |
| ,, | 13 | యూగో | తయూగో |
| 39 | 3 | బొజ్జాతిము | బొజ్జాతియు |
| 45 | 8 | కొపుగ | కొలుపుగ |
| 51 | 18 | నొటునంటి | నెటునంటి |
| 56 | 10 | వేసస్టి | వేసిన ట్టి |
| 64 | 13 | పొంగ | పొంగు |
| 66 | 15 | మీఁదను | మీఁదన. |
| 70 | 12 | నామీఁదియు | నామీఁదడయు |
| 79 | 16 | శ్రోత్రియపు | శ్రోత్రియపు |

